# జిడ్డు కృష్ణమూర్తి తత్వంలో

## నవ్యత — నాణ్యత

జె. శ్రీరఘుపతిరావు, బి.ఇ.,ఎఫ్.ఐ.ఇ.



ఎ.బి.సి. పబ్లిషర్స్ & డిస్ట్రిబ్యూటర్స్
తిరుపతి

JIDDU KRISHNAMURTI TATWAMULO
NAVYATA - NAANYATA

By

J. SREE RAGHUPATHI RAO

1000 copies

AUGUST 1992



Copies available with

1) ADITYA BOOK CENTRE
101-5, PRAKASAM ROAD
TIRUPATI - 517 501

2) J. SREE RAGHUPATHI RAO
15/77, Padmavathi Nagar
TIRUPATI - 517 502

Rate: Rs. 19-00

Printed at:

L.V. GRAPHICS
268, Prakasam Road
Tirupati - 517 501

# సూచిక

ఒక మనవి .................................... (i)
ఒక మాట .................................... (ii)

ఒకటో భాగం - విశిష్టజీవితం

అసాధారణ ప్రబోధకుడైన అతి సామాన్యబాలుడు ........ 1

రెండో భాగం - విశాలతత్వం

జీవించడమూ, మరణించడమూ కలిసే వుంటాయి ....... 7
నిబద్ధత పరిశోధనకు అవరోధం .................... 11
నేననగా నెవరు?................................ 14
మతమంటే బూర్జువా ఆధ్యాత్మికత................ 16
గురువులున్నారు జాగ్రత్త! 20
నీవు సృష్టించుకొన్నదే నీ దైవం 25
సత్యం బాటలేని చోటు ........................ 29
ధ్యానం ధ్యేయమూ కాదు, సాధనా కాదు.......... 35
ఏకాగ్రత వేరు, శ్రద్ధ వేరు ..................... 39

మూడో భాగం — విశేషభాషితం

జ్ఞానం - అవగాహన ............................ 42
బంధవిముక్తి.................................. 49
జీవన తత్వం................................. 53
"జిడ్డు" చేసిందేమిటి? ........................ 62
ఆలోచనా కాలుష్యం ........................... 66
తత్వవేత్త జిడ్డు కృష్ణమూర్తి ..................... 70
పరివర్తన అవసరమా?.......................... 75
జీవితం ప్రేమతత్వం ........................... 78
జిడ్డు కృష్ణమూర్తి తత్వంలో మరికొన్ని ముఖ్యాంశాలు .. 84

నాలుగో భాగం - విషయ మూలం

ఆధార గ్రంధాలు................................ 91
ఇతర రచనలు .................................. 92

# ఒక మనవి

లోకానికి వెలుగు లోకబాంధవుడు. అతడే ఆదిత్యుడు. విద్యార్థిలోకానికి వెలుగు విజ్ఞానగ్రంథాలూ, పాఠ్యపుస్తకాలూ. వాటిని అందరికీ అందించే ఆసక్తితో తనవంతు కర్తవ్యం నిర్వహిస్తోంది మా ఆదిత్య బుక్ సెంటర్.

మానవలోకానికి మహాబాంధవుడు మన కృష్ణమూర్తిగారు. జీవిత అవగాహననూ, తాత్విక వెలుగునూ ప్రసాదించారు. ఇది వినూత్న ప్రకాశమనీ, అధునాతన దృక్పథమనీ శ్రీ రఘుపతిరావుగారి పుస్తకాల వల్ల తెలిసింది. ఈ మనీషి మదనపల్లిలో పుట్టడం మరోవిశేషం. వారి ప్రసంగాలు ప్రపంచ ప్రజలు ప్రీతిగా విన్నారు. మరి మనమో?

మనం మరింతగా వినాలి. మనభాషలో వినాలి, ముచ్చటించుకోవాలి. హృదయాలు కదలాలి. అదే మా ఆశయం. అందుకే ప్రచురణకు పూనుకున్నాము.

ఈ ప్రయోగాన్ని పాఠకులు ప్రోత్సహిస్తారని మా ఆకాంక్ష!

ఇట్లు
యస్.పి. రావు
ఆదిత్య బుక్ సెంటర్
పబ్లిషర్స్ & డిస్ట్రిబ్యూటర్స్

తిరుపతి
22-6-1992

# ఒక మాట

శ్రీ జిడ్డు కృష్ణమూర్తి సాధారణ జీవిగా పుట్టారు. స్వతంత్రుడుగా, సంపూర్ణ మానవుడుగా వికసించారు. ఏ మతానికీ, ఏ వర్గానికీ, ఏ సిద్ధాంతానికీ చెందలేదు. అందుచేత వారి తత్వానికి ఏ పేరు పెట్టడానికీ వీల్లేదు. మానవుడు మానవుడుగా, మానవీయుడుగా, మానవతామూర్తిగా బ్రతకడంలో వారికి వారే ప్రమాణం.

కృష్ణమూర్తే ఒక జీవన తత్వం. దాన్ని తెలిసికోడానికీ, తెలియజెప్పడానికీ ప్రయత్నం జరుగుతోంది. అందులో భాగంగా శ్రీకాళహస్తి, తిరుపతి పట్టణాలలో అధ్యయన కేంద్రాలు నడుస్తున్నాయి. గ్రంథాలు వెలువడు తున్నాయి. రేడియోలో ప్రసంగాలూ, పత్రికల్లో వ్యాసాలూ వస్తున్నాయి.

ఇపుడు ఈ పొత్తం రూపొందింది.

మొదటి భాగంలో వున్న కృష్ణజీ 'విశిష్టజీవితం' 'ఉదయం' పత్రికలో వచ్చింది.

రెండోభాగంలో వున్న 'విశాలతత్వం' వారు పదే పదే వివరించిన వాస్తవాలు.

మూడోభాగంలో వున్న 'విశేషభాషితం' ఆయా సమయాల్లో నేనందించిన వ్యాసాలూ, ఉపన్యాసాలూ.

నాలుగో భాగంలో వున్న 'విషయమూలం' లోవి ఎల్లరూ తెలిసికోదగ్గవి.

విషయం సమగ్రంగా అందించాలన్న భావనతో వేరు వేరు సందర్భాలలో దేనికది వ్రాయడం జరిగింది. అందుచే పునరుక్తాలు న్నాయి. చాల వరకు సరిచేశాము. ఒకటి, రెండు ఉన్నా అవి స్పష్టతకు దోహదం చేయగలవు.

ఇది ప్రధానంగా తత్వార్థం; పార్థకమైంది. ఒక్కొక్క వాక్యమూ చదవండి, అర్థం చేసుకోండి. లోతుగా గ్రహించండి. అవుననవద్దు, కాదన వద్దు. ఇతర అభిప్రాయాలు పక్కన పెట్టండి. లేకపోతే అవి అవగాహనను అడ్డగిస్తాయి. కాబట్టి ఏ అవరోధాలూ లేకుండా, ఆసక్తిగా, అధ్యయనం చేయండి. శబ్దపరమైన అనుభూతులు బుద్ధి పరంగా నైనా అర్థమయితే, మనలో వాస్తవికత విచ్చుకోవచ్చు.

ఇందున్నవి జీవిత సత్యాలు. అక్షరబద్ధం చేసి ఆంధ్రపాఠకుల కరకమలాలకు అందిస్తున్నాము. మనసు పెట్టండి. మానవతా స్ఫూర్తి పొందండి.

చదివి మీ మీ స్పందన తెలియజేయండి.

ఈ సందర్భంగా శ్రద్ధాసక్తులతో సూక్ష్మంగా పరిశీలిస్తూ సమ గ్రంగా ప్రూఫులు దిద్దిపెట్టిన ఇంజనీరు కె. హనుమంతు గారికీ, డా. యన్. భాస్కరరెడ్డి గారికీ నా హార్దిక కృతజ్ఞతలు ప్రకటి స్తున్నాను. అదే రీతిలో తన శక్తికొలది తోడ్పడిన చి॥ జననికి శుభాభినందనలు తెల్పుచున్నాను.

తిరుపతి
15-8-92

ఇట్లు
జె. శ్రీ రఘుపతిరావు

## విశిష్ట జీవితం

# అసాధారణ ప్రబోధకుడైన అతిసామాన్య బాలుడు

అడయారు తీర తిన్నెలపై ఇరువురు బాలురు ఆడుకొంటు న్నారు. వాళ్ళు అన్నదమ్ములు. పెద్దవాడికి 14 సంవత్సరాలు. అటువైపుగా సముద్ర స్నానానికి ఒక ఆంగ్లేయుడు వెళ్తున్నాడు. అతడు దివ్యజ్ఞాన సమాజ భవనాల నుండి వచ్చాడు. పొడగిరి, స్ఫురద్రూపి, గడ్డాలు, మీసాలు ఉన్నవాడు. పేరు బిషప్ చార్లెస్ వెబెస్టర్ లెడ్‌బీటర్. పేరున్నవాడు. ప్రధాన సభ్యులలో ఒకడు. అధ్యక్షురాలైన అనిబెసెంట్‌కు ఆప్తుడు. 'అతీంద్రియజ్ఞానం' లో నమ్మకమున్నవాడు.

లెడ్‌బీటర్ అబ్బాయిలిద్దరిని చూశాడు. పెద్దవాడి ముఖవర్చస్సు ఆకర్షించింది. అతని అమాయకప్పటునికి ఇతన్ని నిలబెట్టింది. అతనిలో దివ్య లక్షణాలున్నాయని గుర్తించాడు. అతని దేహం మహా గురువులకు నిలయం కాగలదని భావించాడు. అతడు భావి ప్రపంచ బోధకుడు కాగలడని ప్రకటించాడు. ఆ బిడ్డ ఎవరా అని ఆరా తీస్తే 'సమాజం'లో పనిచేస్తున్న జిడ్డు నారాయణయ్య కుమారుడు అని తేలింది.

నారాయణయ్య రెవిన్యూ డిపార్టుమెంటులో పనిచేసి రిటైర్ అయిఉన్నాడు. రెండేండ్ల నుండి ఖాళీగా ఉన్నాడు. అంతకు రెండేండ్ల ముందు భార్య సంజీవమ్మ చనిపోయింది. శేష విశ్రాంత జీవితం దివ్యజ్ఞాన సమాజ సేవలో గడపాలని బిడ్డలతో సహా అడయారు చేరాడు. అప్పటికి ఈ బిడ్డ వయస్సు 14 సంవత్సరాలు. ఎవి

మిదవ సంతానమగుటచే కృష్ణమూర్తి అని పేరు పెట్టారట.

కృష్ణమూర్తికీ తమ్ముడైన నిత్యానందకూ అనిబెసెంటు యొక్క ఆశ్రయం లభించింది. అది చాలా ప్రోత్సాహకరంగా ఉంది. ప్రత్యేక విద్యకు, ప్రత్యేక పోషణకు, ప్రత్యేక శిక్షణకు చక్కని సదుపాయాలు చేకూరాయి. పైగా 'కృష్ణ' అనిబెసెంట్‌కు దత్తపుత్రుడయ్యాడు.

కృష్ణమూర్తి మోషే ప్రవక్తలాంటి వాడవుతాడని ఊహించారు. అందుచే ముందుగానే హంగామాలు, ఆర్భాటాలు, ఏర్పాట్లు, ఎన్నో రకాల ప్రచారాలు చేయడానికి అనిబెసెంట్, లెడ్‌బీటర్, జార్జి అరండేల్ మొదలగువారు పూనుకున్నారు. ప్రాగ్దిక్తారా పరిషత్తు అను అంతర్జాతీయ సంస్థను స్థాపించారు. అది దివ్యజ్ఞాన సమాజను సోదర సంస్థగా పని చేయసాగింది. వేలాది మంది సభ్యులయ్యారు. ప్రపంచమంతటా వ్యాప్తి చెందింది. దానికి కృష్ణ మూర్తిని అధ్యక్షునిగా చేశారు. అతని వయస్సు 16 సంవత్సరాలు. అతని ప్రచారానికి ఒక 'నక్షత్ర' పత్రికను స్థాపించారు. అతడ్ని దాని సంపాదకునిగా నియమించారు. దానికి కోట్లాది రూపాయల విలువగల ఆస్తులు చేకూరాయి. దానికి హెడ్ క్వార్టర్స్ హాలెండ్‌లో 'ఆమెన్' దుర్గంలో నెలకొల్పబడింది. ఇలా కృష్ణమూర్తి 18 సంవత్సరాలు దివ్యజ్ఞాన సమాజ వాతావరణంలో తారా పరిషత్తు అభివృద్ధికీ, సభ్యుల ఉన్నతికీ బహుళంగా పాటుపడ్డాడు.

ఈ లోగా కృష్ణకి 26వ ఏట పెద్ద ఇబ్బంది వచ్చింది. తమ్ముడైన నిత్యానందకు క్షయ వ్యాధి సోకింది. అతనిపై కృష్ణమూర్తికి అనూహ్యమైన అమితానురాగం. అన్ని విషయాలకు అతనిపై ఆధారపడేవాడు. వారి అన్యోన్యానుబంధం అక్షరబద్ధం చేయడం అతికష్టం. వ్యాధినివారణ నిమిత్తం అమెరికా-కాలిఫోర్నియాలోని ఓహై లోయ చేరారు. అది ఒక ఎత్తైన సుందరానంద నందన వననగ ప్రదేశం.

ఓహై చేరిన కొద్ది నెలలకు కృష్ణమూర్తికి విచిత్ర వేదనా

నుభూతులు మొదలైనాయి. వణుకు-మూలుగు-అలసట-తలనొప్పి-మెడబాధ-వెన్నుపూసలో వేదన-అపస్మారకం-అత్యంత పరిశుభ్రతా పక్తి-హృదయ ప్రక్షాళనం-తెలియని మార్పు-లో వెలుపల ప్రశాంతత మున్నగు స్థితులు సంభవించాయి. వరుసగా మూడురోజులు తీవ్రమైన మార్పుకు గురి అయ్యాడు. అచ్చటి పెప్పర్ వృక్షం క్రింద ధ్యాన స్థితుడైనాడు. బోధి వృక్షం చెంత బుద్ధుడు సమ్యక్ సంబోధి పొందిన ట్లుగా, పెప్పర్ వృక్షం క్రింద కృష్ణమూర్తి స్వేచ్ఛాయుత సమున్నతా చైతన్యస్ఫూర్తి పొందాడు. ఆ చైతన్యం స్వచ్ఛమైంది. వినూత్నమైంది. వాస్తవమైంది. విస్పష్టమైంది. ఈ భావాలనూ, సంఘటనలనూ, అనుభూతులనూ చెంతనే ఉన్న నిత్యానంద నమోదు చేశాడు. తన అన్నను అనుగ్రహించడానికి తథాగతుడు అద్భుత దివ్య తరంగాలను ప్రశాంత ఓహై లోయలో ప్రసరింపజేశాడని భావించాడు.

"ఇప్పుడు నా దాహం తీరింది.... వెలుగు చూశాను. కరుణ స్పృశించాను. ఇది నా కొరకే కాదు. ప్రపంచం మొత్తానికి సత్య దర్శనం. చీకటులు తొలిగాయి. మహిమాన్వితమైన ప్రేమతో నా హృదయం మత్తెక్కింది. ఇక నా హృదయం మూతపడదు. అనంత ఆనందాన్నీ శాశ్వత సౌందర్యాన్నీ అనుభవించాను...." అని కృష్ణ మూర్తి మిత్రులకు వివరించాడు. "నేను మార్పు చెందాను. నా మిత్రుల జీవితాలకు కూడా మార్పు కూరుస్తాను. ప్రపంచ పురోగ తికి పాయపడతాము. నా అంతరంగమంతా శక్తితోను, ఆలోచనతోను నిండి ఉంది" అని తనను పదకొండేళ్ళ నుండి వాత్సల్యామృత వర్షంతో ముంచెత్తుచున్న - వైస్రాయ్ లిట్టన్ దొర కుమార్తెయైన - లేడీ యెమిలీకి వ్రాసికొన్నాడు.

ఇది ఇలా జరుగుతుండగా నిత్యానందకు వ్యాధి తరగడం, పెర గడం జరుగుతూంది, ఆదుర్దా కలిగిస్తూంది. అచట కొంత ఆస్తిని దానపూర్వకంగా స్వీకరించి 'సోదరుల ధర్మ సంస్థ' పరం చేసి దానికి 'ఆర్య విహార్' అని పేరు పెట్టారు. ఇచట చికిత్స పొందుచుండగా కొంత కాలానికి నిత్యానందకు వ్యాధి తీవ్రమైంది.

అతడు రక్తం కక్కుకొని, నీరసించి మంచం పట్టాడు.

ఇంతలో దివ్యజ్ఞాన సమాజ స్వర్ణోత్సవ సదస్సుకై అడయారు బయలుదేరమని కృష్ణమూర్తికి బిసెంట్ తంతి పంపింది. నిత్యానంద చనిపోవడానికి వీలులేదనీ, పరమ గురువుల హామీ వున్నట్లూ 'కృష్ణ' గట్టిగా నమ్మాడు. నిత్యానందను వదలడానికి ఇష్టం లేకపోయినా అతి కష్టంమీద ఇండియాకు బయలుదేరాడు.

ఓడ రోమ్ నగరం దాటింది. కొలంబో చేరకముందే నిత్యానంద అస్తమించినట్లు తంతి వార్త వచ్చింది. నిర్ఘాంతపోయాడు. కృష్ణమూర్తి పది రోజులపాటు గుండెను పిండే ఆవేదనతో క్రుంగిపోయాడు, కుమిలిపోయాడు, అలమటించాడు, అంగలార్చాడు. అతని హృదయం వ్రయ్యలయ్యింది. ఘనసు చెదిరిపోయింది. విశ్వాసం బ్రద్దలయ్యింది. భవిష్యద్రూపకల్పనలో నిత్యానందపాత్ర చితికిపోయింది. అతని దుఃఖం చూసిన వారి గుండెలవిసిపోయాయి.

అయితే పదకొండో రోజున జాగృతుడైనాడు. బలం పుంజుకున్నాడు. దుఃఖాన్నెదుర్కోడానికి పిడికిలి బిగించాడు. నూతన శక్తి ఆవిర్భవించింది. చైతన్యం చిగురించింది. పాత కల మాసిపోయింది. కొత్తజీవితం మొదలైంది. తడిసిన నేల నుండి అంకురం ఆవిర్భవించినట్లయింది. "నేను దుఃఖించాను. కాని ఇతరులు దుఃఖించరాదు. దుఃఖమంటే ఏమిటో నాకు తెలిసింది..... జీవితంలో నిజమైన సౌందర్యం, సౌఖ్యం, విశేష శక్తి, ఉన్నత ప్రేమ ఉన్నాయని నాకిపుడర్థమైంది. వాటిని భౌతిక వియోగం గాని, గతించిన ఘటనలు గాని భగ్నం చేయలేవు. నాలోని ప్రేమ అప్రమేయం, అజేయం, అవినాశం" అని ఒక సత్యతత్వప్రేమమూర్తిగా బయటపడ్డాడు.

ఓహై లోయలో జరిగిన ప్రక్రియా, నిత్యానంద అస్తమయంవల్ల కల్గిన అనుభూతీ అతని పరివర్తనకు నేపథ్యం పలికాయి. కేవలం పరిశుద్ధమైన మానవ మాత్రుడుగా వికసించినాడు. సంఘర్షణను అతిక్రమించినాడు. విశ్వాసాలు వదలినాడు. జాతీయత లేదన్నాడు. సకల

బంధాలను, గుర్తింపులను కాదన్నాడు. అదే ధోరణిలో తననింతకాలం పెద్ద చేసిన 'తారా' సంస్థను రద్దు చేయదలిచాడు.

1929 లో ఆమెన్‌లో సమావేశం ఏర్పాటుచేశాడు. 3000 మంది సభ్యులు హాజరయ్యారు. అనిబెసెంట్ కూడా శ్రోతల్లో ముందు కూర్చొని ఉంది. ప్రశాంత వాతావరణంలో ప్రసన్న హృదయంతో ఇలా మొదలుపెట్టాడు: "ఈ ఉదయం మనం 'తారా పరిషత్తు'ను రద్దు పరచడాన్ని గూర్చి చర్చిస్తున్నాం. ఇది కొందరి కాహ్లాదకరంగా, కొందరికి విషాదభరితంగా ఉండొచ్చు. పరిషత్తును రద్దు పరచక తప్పదు.... సత్యం పంథా లేని ప్రదేశం. ఏ మార్గం ద్వారాగానీ, ఏ మతం ద్వారాగానీ, ఏ శాఖ ద్వారాగానీ సత్యాన్ని పొందలేరు.... అది హద్దులకూ, నిబద్ధతలకూ లోనుకానిది. కాబట్టి అది సంస్థాగతం కారాదు. ఒక ప్రత్యేక పంథానుబట్టి పొమ్మని ఏ ఒక్క సంఘమూ ప్రజలను వత్తిడి చేయరాదు. ఇది గ్రహిస్తే ఒక నమ్మకాన్ని సంఘపరం చేయడం అసాధ్యమని తేల్తుంది.

"విశ్వాసం కేవలం వ్యక్తిగతమైంది. దాన్ని మీరు సంస్థాగతం చేయరాదు, చేయలేరు. చేస్తే అది శవసదృశమవుతుంది. ఘనీభవిస్తుంది. అంతేగాక అది ఒక విభాగమో, ఒక శాఖో, ఒక మతమో అయి తీరుతుంది. అది ఇతరుల నెత్తిన రుద్దబడుతుంది.

"నాకు అనుచరులు లేరు, అవసరం లేదు. వ్యక్తిని అనుసరించడం మొదలు పెడితే సత్యాన్ని అనుసరించడం ఆగిపోతుంది. నేను సర్వస్వతంత్రుణ్ణి, సత్యపూర్ణుడను. నన్నట్లే అర్థం చేసుకోండి. మీరు కూడా స్వేచ్ఛ పొందాలని కోరుతున్నాను.

"మీరు అధికారానికి దాస్యం చేయడానికి అలవాటుపడ్డారు. అది ఆధ్యాత్మికంవైపుకు దారి తీస్తుందని మీ అభిప్రాయం. ఒక మహిమ ద్వారా సుఖమయ స్వర్గమయ రాజ్యమగు శాశ్వత స్వేచ్ఛకు ఎవరో రవాణా చేస్తారని ఆశిస్తున్నారు.... అంతరంగం స్వచ్ఛందంగా

ఉండడమే ఆధ్యాత్మికత. అది శాశ్వతం. అది హేతు ప్రేమల సంలీనం. అది పరిపూర్ణ సత్యం. అదేజీవితం....

"స్వర్గ రాజ్యపు తాళపు చెవి నీ చేతిలోనే ఉంది. నీ అంతరంగపు పవిత్రతపై, స్వచ్ఛతపై ఆధారపడింది. అదే స్వర్గ రాజ్యం. తారా పరిషత్తు రద్దు చేయడానికిపుడే నిర్ణయం తీసుకున్నాను, అధ్యక్షుడిగా".

అందరూ అవాక్కైపోయారు. అనిబెసెంట్ హతాశురాలైంది. పరిషత్తు రద్దయింది. తర్వాత దివ్యజ్ఞాన సమాజానికి కూడా రాజీనామా ఇచ్చాడు.

ఈ విధంగా కృష్ణమూర్తి విశ్వమానవతత్వాన్ని మరో 56 ఏళ్ళపాటు ప్రపంచానికి బోధించాడు. ప్రపంచమంతటా తిరిగాడు. అరమరికలు లేని ప్రేమ పంచుకొన్నాడు. అతని మొదటి అడుగే చివరి అడుగు. ఆది నుండి అంతం దాకా స్వేచ్ఛగా ఉన్నాడు. మనోగతులను, ఆలోచనా కాలుష్యమును అతడు అధ్యయనము చేసినంతగా మరెవ్వరూ చేయలేదేమో. వీటిని వేరే పరిశోధనాంశాలుగాగాక జీవన ప్రవాహ సమ్మిళితాంశాలుగా జూశాడు.

పిల్లల మనసులు జీవితాంతం నిర్మలంగా నుంచుటకు తగు ప్రత్యేక విద్యా శిక్షణా పాఠశాలలు దేశ విదేశాల్లో నెలకొల్పాడు.

కడకు 91 వఏట ఓహై కాలేజీలో, పెప్పర్ చెట్టు పక్కనే నిద్రలో కన్నుమూశాడు. కాలేయంలో కేన్సర్ వ్యాధి ఉన్నా నిశ్చింతగానే తను త్యాగం చేశాడు. అతడు కోరిన రీతిగానే మంత్రతంత్రాలూ, కర్మకాండలూ, ప్రార్థనా ప్రసంగాలూ, ప్రజా ప్రదర్శనలూ లేకుండా విద్యుదగ్నికి ఆహుతి చేశారు.

జీవన దర్శన స్ఫూర్తి, వసుధైక కుటుంబ వర్తి, తాత్విక యుగ చక్రవర్తి, అతడే జిడ్డు కృష్ణమూర్తి.

# విశాల తత్వం

## జీవించడమూ, మరణించడమూ కలిసే వుంటాయి

ఉత్పత్తి - నాశనమూ సృష్టిక్రియలో సహజాంశాలు. అవి జీవిత గమనానికి హద్దులు. ఆ రెంటి మధ్యకాలమే వ్యక్తి జీవితకాలం. వాటిని వరుసలో చెప్పాలంటే పుట్టుక చావు అనాలి; చావు పుట్టుకలు కాదు. ఇది గ్రహించాల్సిన వాస్తవం. జీవితాన్నిగూర్చి లేక ఒక వస్తువును గూర్చి చెప్పబడే విషయమే తత్త్వం. దాని వ్యవహారం, ప్రస్తావన, విశ్లేషణ, విధానం, ప్రయోజనం - అంతా తాత్విక ధోరణిలో చూడవచ్చు.

జీవించడాన్ని గురించీ మరణించడాన్ని గురించీ కృష్ణమూర్తి చెప్పే తత్త్వమేమిటి? జీవించడం చక్కగా తెలిసిన వానికి చావును గూర్చిన దిగులు లేదన్నాడు. చావును గూర్చి చర్చించువాడు జీవించుట లేదని అర్థము. అతడు జీవించవలసిన తీరుతెన్నులు తెలియనివాడు; మరణానంతర జీవితంపై ఆశలు పెంచుకుంటాడు. మరణానికి పూర్వముగల జీవితమును మన్నించనివాడు మరణానంతర జీవితమును గూర్చి మననము చేస్తాడు. ఉన్నదానిపై తీపిలేనివాడు లేనిదాని యెడ పరితపిస్తాడు. కనుక కృష్ణమూర్తి ప్రధానంగా నిత్య జీవితం గూర్చి భాషిస్తాడు. మరణం జీవితంలో నిత్యమూ అంతర్లీనమైన భాగంగా సూచిస్తాడు.

కృష్ణజీ మరణము యొక్క భౌతిక పరిణామమును గూర్చి చర్చించుట ప్రధానమనలేదు. పునర్జన్మను పరిగణించలేదు. కర్మ సిద్ధాంతము నంగీకరించలేదు. స్వర్గ నరకాల జోలికి పోలేదు. పునరావృత్తి రహితమైన ముక్తిని గూర్చి ముచ్చటించలేదు. తీర్పు దినమునకెదురు చూడలేదు. కర్తవ్యభారమును దేవుని చిత్తమునకు వదలలేదు.

మరణమనగా నేమని ప్రశ్నించాడు? శరీరము శిథిలమగుటా? ప్రాణము దేహమును విడిచిపోవుటా? ఏదైనా ప్రమాదమునకు గురి యగుటా? శారీరక క్లేశాన్ని గూర్చి కృష్ణజీ వర్ణించడం లేదు. మరణమును గూర్చి మానసికమైన ఆందోళన వివరిస్తారు. శారీర కమైన బాధకన్న మరణమును గూర్చిన భయం మనిషిని వెన్నా డుతుంది. భయమెలాంటిది? తాను సంపాదించుకున్న సంపత్తు - సత్కీర్తి, ధనం - ధాన్యం, ఇల్లు - వాకిలి, ఉద్యోగం - సద్యోగం, పెళ్ళాం - పిల్లలు, ఆశలు - ఆలోచనలు, సిద్ధాంతాలు - రాద్ధాం తాలు, నమ్మకాలు - విశ్వాసాలు, రాగాలు - అనురాగాలు, మతాలు - మమతలు, ఆచారాలు - వ్యవహారాలు, అన్నీ దూరమైతాయనే భయం. ఇవేవీ లేకుండా తాను ఒంటరై పోతాడేమోనన్న బెంగ. భద్రత కోల్పోవుననే పిరికి తనం. ఇదంతా మానసిక గందరగో ళము. ఊహాత్మకమైంది. ఇదీ మరణ భయానికి కారణము. మర ణాని కన్న భయానికే ఎక్కువ బెదిరిపోతాడు. ఈ భయం నుండి తప్పకోవాలనే తపనతో ఇంకా బ్రతకాలన్న ఆశతో మానవుడు స్వర్గ నరకాలను పునర్జన్మను అవతారాలను, పరలోక తీర్పులను, శాశ్వత శాంతివిముక్తులను కల్పించు కున్నాడు.

అందువల్ల జీవితవిషయాన్ని సమగ్రదృష్టితో గమనిస్తే, చావు యొక్క తత్వాన్ని కూడ మనిషి గ్రహించగలడు. పనిపాట్లకూ, వ్యవహారాలకూ, సాంకేతిక విద్యకూ సంబంధించినవి తప్ప గతిం చిపోయినవీ. ఇతరత్ర మనసుకు సంబంధించినవీ జ్ఞాపక చిహ్నాలుగ నెమరు వేసికోరాదు. మనసంతా నమ్మకాలతో, అభిప్రాయాలతో, మౌఢ్యంతో, అహంభావాలతో నింపుకోరాదు. స్వేచ్ఛగా, స్పష్టంగా అద్దంలా ఉంచుకోవాలి. ఏ నిమిషానికి ఆ నిమిషం జీవితం కొత్తగా ఉండాలి. జీవిస్తూన్నపుడే గతించిపోయే దాన్ని ఎప్పటికప్పుడు చావుగా భావించాలి. అంటే గతంమీద ఆధారపడి, భవిష్యత్తును సృష్టిం చుకొంటూ, అదేవర్తమానమనుకొని బ్రతికితే గతం చచ్చేదెట్లా? నిమిషనిమిషానికి, గడియ గడియకు చస్తుండాలని చెప్పే మాటలలో

అర్థం ఇది. ఈ విధంగా నిత్యచైతన్యంగా జీవిస్తూ, చావును రుచి చూస్తూ పునః చైతన్యమవుతూ బ్రతికినవాడు భౌతికమైన చావును గూర్చి గాభరా చెందడు, భయాందోళనలను పొందడు. దేహాన్ని వదలటం మొత్తంమీద ఒకచిన్న విషయం. పుట్టుకకు చావుకు విభజన లేదు. అది యొక గమనం. అంటే చావుకు చాలా స్వల్పమైన అర్థమేర్పడుతుంది. ఇది జీవన మరణాల తత్త్వము.

చావంటే ఏమిటి? జీవితమంటే ఏమిటి? బ్రతుకంటే నిరంతర పోరాటాన్నీ, ఘర్షణాన్నీ, అధికారాన్నీ, ఔన్నత్యాన్నీ, స్థానాన్నీ, స్థితినీ, స్టేటస్‌నీ గూర్చి ప్రాకులాట. ఆందోళన, అసూయ, బంధం, తత్సంబంధమైన వాటితో పోరు అని అనిపిస్తోంది. చావంటే ఏమిటి? మానవ శరీరము అసాధారణ మైన క్లిష్టమైన పనిముట్టు. అది అరుగుదల చెందుతుంది. జీవకణ సముదాయం సమాప్తమైపోతుంది. దీనిని మనం చావంటాము. మన చైతన్యం చావుతో అంతమైపోతుంది. మన స్వార్థాలు - కాంక్షలు, అహం, వ్యక్తిత్వం, అభిరుచులు - ఇవన్నీ చేరి మనచైతన్యమవుతుంది. మన చైతన్యమే మనం. అది మనకు వేరైనదికాదు. చావును జీవితానికి చిట్టచివరలో ఎందుకు పెట్టాము? ఎందుకంటే చివరిదాకా తెలిసిందాన్ని పట్టుకు వ్రేలాడాలని. చావు తెలియనిది. తెలిసినదాంట్లో భద్రత ఉంది. అందుకే చావటానికన్నా, దుఃఖంలో జీవించటానికే ఇష్టపడతాము".

"జీవిస్తున్నపుడు, చస్తూ కూడ బ్రతకగలమా? చావు అంటే ఆఖరు. జీవితంతోనూ, చావుతోనూ కలిసి బ్రతుక గలమా? చావుతో జీవించటమంటే క్షణ క్షణం ప్రతిమానసిక స్మృతిని అంతం చేయటం. ప్రతిఫలం లేకుండా మనం దేనినైనా ఐచ్ఛికంగా వదలగలమా! బంధమున్న చోట ఆదుర్దా, భయం, అసూయ ఉంటాయి. చావంటే అన్ని బంధాలకూ ఆందోళనకూ, అసూయకూ, భయానికీ, సమస్త మానసిక స్మృతులకూ అంతం. మనం అంతం చేసేది మానసిక స్మృతిని.

"మనం గందరగోళంగా ఉన్నాం. కనుక మనం ధ్యానం ద్వారా నిశ్శబ్దం కోరుతున్నాం. స్పృహతో, బహిరంగంగా చేసేది ధ్యానం కాదు. ఇతరమైనవి రానీయకుండ మనస్సును ఒకే దానిపై కేంద్రీకరించటం ఏకాగ్రత. ఏకాగ్రత వహించినపుడు మనసుకు విక్షేపం కలుగుతుంది. విక్షేపం వల్ల శక్తిని వృధా చేయటమవుతుంది. సర్వాభిలాష శక్తిపాతమే. నిజమైన ధ్యానంలో అభిలాష లేదు. 'ఉన్నదాని' యెడ గమనిక మాత్రముంటుంది. ఆ స్థితిలో విభాగం లేదు. అది వేరు, ఇది వేరు అనిలేదు. ధ్యాని - ధ్యానము, గమనించేవాడు - గమనించ బడేది, ఒకటే అవుతుంది". 1

"తత్త్వ శాస్త్రవేత్తలు కేవలం ప్రపంచానికి భాష్యం చెప్పి కూర్చోడమే కాదు. ప్రపంచాన్ని మార్చడాన్ని లక్ష్యంగా పెట్టుకోవలన్నాడో పెద్దమనిషి. కాని కొన్ని భాష్యాలకు పట్టిన తుప్పును, కొన్ని మడ్డి ఆలోచనలను ముందుగా మార్చనిదే మానవునికి నిజమైన విమోచన దగ్గర పడలేదని భావించిన 20వ శతాబ్దపు ప్రపంచపు తాత్త్వికులలో జాపోల్ సార్త్‌నీ (ఫ్రాన్సు), జిడ్డు కృష్ణమూర్తినీ సుప్రసిద్ధులుగా పేర్కొనాలి. మానవ సమాజ పరిణామంలో సాంఘిక పరిస్థితులకూ, వాటి మంచి చెడులకూ కీలకమైన ఆర్థిక పరిస్థితులకు మార్క్సిజం పెద్దపీట వేస్తే ఆ మార్క్సియన్ తాత్త్విక పునాదులను సంస్కరించడంకోసం మంచి చెడుల పూర్ణ కుంభమైన మానవుని ఉనికిని గుర్తించి, మానవుని కేంద్రబిందువుచేసి, చైతన్యం ద్వారా అతణ్ణి మార్చడమే ప్రధానమని భావించినవారు జాపోల్ సార్త్. మరొకమాటలో చెప్పాలంటే సార్త్ తాత్త్విక పునాదులే జిడ్డు కృష్ణమూర్తి భావనలకూ, తాత్త్విక చింతనకూ కూడా ఆధారాలు.......

18వ శతాబ్దినాటి జాక్విన్ రూసోలాగా, 19వ శతాబ్దం నాటి హిడేగర్, కిర్క్‌గార్డెన్‌లా, ఈ మధ్య కాలంలోనే చనిపోయిన సార్త్‌లాగా మన కృష్ణమూర్తి కూడా సంప్రదాయ విరోధి.......

1 (6-1-85 మద్రాసు ప్రసంగం నుండి, కె.యస్. రిపోర్టు హిందు 21-1-85)

# నిబద్ధత (CONDITIONING) పరిశోధనకు అవరోధం

మనమెంత స్వచ్ఛందమైతే అవగాహన అంత ఉన్నతమౌతుందని కృష్ణజీ అభిభాషణ. స్వేచ్ఛలో నున్న మనస్సు సూక్ష్మంగా గ్రహించగలదు. పుట్టినప్పటినుండీ మనసునూ, మనిషినీ బంధించి వేశాము. అంతేగాదు దానికి సహజమైన వికాసం రాకుండ ముందుగనే రంగురంగులు దిద్దాము. వెలుగు పుట్టేచోటుకే తలుపులు వేశాము. ముందు దాని తలుపులు తెరవాలి, తుడవాలి, శుద్ధిచేయాలి, సిద్ధపరచాలి. ప్రస్తుతం చేయవలసిందేమంటే నిర్మించిన దాన్ని తీసివేయటం. దాని స్థానంలో ఏమి పెట్టాలన్న ప్రశ్న ముందుగనే పుట్టుకొస్తుంది. ఖాళీలన్నీ భర్తీ చేయటం మన విధాయకం కాదు. నింపటం నిల్వచేయటం నరునికి నిబద్ధతకారాదు. ఖాళీగా ఉంటే కావలసిందేదో సకాలానికే చొచ్చుకొస్తుంది... [వెనకటికొకసారి వర్ణ వ్యవస్థను స్వల్ప సవరణలతో సమర్ధిస్తూ దాని స్థానంలో వ్యాపార సరళి ప్రవేశిస్తుందని మార్పు నిరోధిస్తూ 'వేదాంతకేసరి'లో ధారావాహికంగా రామకృష్ణ మఠం స్వామి వ్యాసాలు వ్రాశారు. ఆశ్చర్యమేసింది!] పూరించటం కాదు చేయాల్సింది. బుద్ధిలో నున్నదంతా పెరికి బయటకు పారవేయాలి. ఖాళీ కావాలి, ఖచ్చితంగా ఉండటం కావాలి.

"మనిషి నిబద్ధింప బడ్డాడు...... ఒక విధమైన సంప్రదాయం, మతం ప్రకారం బుఱ్ఱలు (బుద్ధులు) మూసపోయబడ్డాయి. అమెరికన్ అని, యూరోపియన్ అని, హిందువని నిబంద్ధింపబడి యుండగా మానవులకు వారి నిబద్ధతనుండి విడుదలగుట సాధ్యమా? అసలు మానవులెందుకు అంతగా నిబద్ధులై ఉన్నారు? మనకేదో భద్రత, అంతర్గతంగా బహిర్గతంగా కావాలని బద్ధులమయ్యామా! అంతరంగమున భద్రత ఉన్నదా? అది లేకపోతే బయటి భద్రత గూర్చి జాతుల ద్వారా సంస్థాగత మతాల ద్వారా పొందాలని ప్రయత్నిస్తాము......

చిన్నప్పటి నుంచీ ఉన్న నమ్మకాలు, విశ్వాసాలు, సిద్ధాంతాలు, మతాభిప్రాయాలు, దేవుళ్లు, దయ్యాలు, మొత్తం మొత్తంగా ఒకేసారి తుడ్చిపెట్టేయ్. శ్రద్ధగావిను, ఆసక్తితో గమనించు. సరళంగా అవగాహన చేసికో, నిజాయితీతో గ్రహించు. అవాస్తవాలను వాస్తవంగా, వాస్తవాలను అవాస్తవంగా చిత్రించకు. దేనితోనూ పోల్చవద్దు. దేనితోనూ పోటీపడవద్దు. దేని ప్రకారమో ఉండాలని ఊహించవద్దు. నీవు చదివిందీ, విన్నదీ నీకు అడ్డురాకూడదు. కండిషనై ఉన్న మనసును విడుదల చేయ్. మళ్లీ కండిషను చేయకు. అపుడు మనసులో వెలుగువస్తుంది. తెలివి పుడుతుంది. ప్రేమ పుడుతుంది. బాధ్యత కలుగుతుంది. జీవితం బాగుపడుతుంది. అదే అసలు జీవితం.

'ది సాంగ్ ఆఫ్ లైఫ్' అన్న పాటలో కృష్ణమూర్తి, ముందే ఒకభావం ఏర్పరచుకొంటే సత్యశోధన సాధ్యం కాదన్నాడు. నిర్మలమైన మనస్సు ప్రధానమన్నాడు. వెయ్యొక్క అభిప్రాయాలను వెయ్యొక్క కళ్ళతో తర్కించి చూచుకొంటాను. సహస్ర హృదయాలతో సహస్ర విధాల ప్రేమించువాడను నేను అని అంటాడు. (A thousand eyes with a thousand views. A thousand hearts with a thousand loves Am I) "మానవుని మనస్సు ఒక ఊటబావి అన్నాడు. నిరంతరం నవనవలాడుతూ ఉండగల అంతశ్శక్తి ఆ ఒక్కదానికే ఉందన్నాడు. స్వార్థానికి చోటివ్వనంతకాలం మనస్సుకు ముసలితనం రాదన్నాడు. అప్పుడే ఇతరుల దుర్మదాంధకారాన్ని, నిరంకుశత్వాన్ని అది ఛేదించగల్గుతుందన్నాడు." 1

మనయొక్క చైతన్యం ఆలోచనతో బంధింపబడేదికాదు. అభిప్రాయానికి మించిన అభిప్రాయం కల్గియుండుట వికాసం కాదు. అభిప్రాయం పెట్టుకోనట్టే, ఆలోచనలో మునిగిపోనట్టే సంపూర్ణ శ్రద్ధా అవగాహనా కావాలంటాడు. పేరుపెట్టకుండ, అభిప్రాయానికి కట్టుబడకుండా, చూస్తున్నానను దృష్టి లేకుండా ఒక పువ్వునుగానీ

---

1 ఉదయం సంపాదకీయం 19-2-86

ఒకరంగునుగానీ పూర్తి శ్రద్ధతో గమనించు. ఇక్కడ అనుభవానికి సంబంధించిన ఫోలికలుగానీ పువ్వుకు సంబంధించిన పోలికలుగానీ పనికిరావు. అది సమగ్ర మైన ఎరుక (choiceles awareness) అవుతుంది. మనసు నిర్మలంగ, స్వేచ్ఛగ ఉంటేనే అది సాధ్యం. అదే వాస్తవానుభవం.

ఆలోచన అవగాహనకు ఆటంకం. గమనించడంవల్ల మాత్రమే అవగాహన కుదురుతుంది. ఆలోచనకు గత స్మృతులు మూలం. కనుక విచారకరమైంది. మెంటల్ కండిషనింగ్ అనగా మానసిక నిబద్ధత. అది జిజ్ఞాస కాటంకమన్నాడు. గమనించుటలో చూచే వాడు, చూడబడేది అభేదమై ఆనందాన్నిస్తుంది.

* * *

# నేననగా నెవరు?

నా చేయి, నాకాలు, నాఇల్లు అను మాటలలో నేను వేరు కదా! ఆ 'నేను' జీవాత్మయనీ, పరమాత్మలో ఒకభాగమనీ, భగ వంతుడనీ సంప్రదాయక వేదాంతులు చెప్తుంటారు. అది సరికాదు. మనసు-హృదయం, శరీరం ఉన్నవాడు మనిషి. మనిషికి తనలోని భావాలలో, నమ్మకాలతో తనచుట్టూఉన్న మనుషులతో వస్తువు లతో, పశుపక్ష్యాదులతో, ప్రకృతితో సంబంధముంది. సంబంధం లేకపోతే నేనులేను. సంబంధంతోనే జీవి మనిషిగా జీవిస్తున్నాడు. సమాజముతో తనకుగల బాంధవ్యాన్నీ, సమాజములో తనకుగల బాధ్యతనూ స్పష్టపరచి, నొక్కిచెప్పాడు. దీనినెంతగా గుర్తెరిగి విశా లపరచుకొంటే, అంతగా విశ్వమానవుడు కాగలడు. ఈ బాంధవ్య బాధ్యతలను సక్రమం, సువిశాలం చేసికొనుటకు సహకరించునదే తత్త్వం.

ఆ 'నేను' యొక్క పోకడలను సూటిగా, సరళముగా తెలిసికొ నడమే తన్ను దాను తెలిసికొనడం. అనగా తన మనోభావాలనూ, నడవడికలనూ, వ్యతిరేకతలనూ, సంబంధములనూ సూటిగా అర్థం చేసికొనటం. తన్ను తా దెలిసి కొన్నవాడు తదితరులను కూడ చక్కగా తెలిసికొనగలడు.

ఇది సమాజపరమైన అర్థం. సంపూర్ణ అవగాహన ఆచరణాత్మ కమైంది. స్వయం ప్రామాణికమైంది. వాస్తవమైంది. ఇందులో ఊహకు తావులేదు. మానవాతీత శక్తి లేదు.

ప్రతిరంగంలోనూ 'నేను' అనేది ప్రకటన కావాలని ప్రయ త్నిస్తుంది. ఆ 'నేను' నశిస్తేగాని మేలులేదని అన్నిమతాలు చెపుతాయి. ఆ 'నేను' స్థానంలో దైవాన్నో, దేశాన్నో ప్రతిష్ఠ చేయమని పుట్టెడు ప్రబోధాలున్నాయి. ఆ 'నేను' చావదు. పరి గదా దైవంతోనూ, దేశంతోనూ ఏకమై గుర్తింపు పొంది పెద్ద

'నేను'గా తయారవుతుంది. ఆ 'నేను'ను చంపవద్దు, అణచవద్దు, ప్రక్కకు నెట్టి వేయవద్దు, నిర్లక్ష్యము చేయవద్దు, దానినుండి దూరంకావాలని చూడవద్దు. దానిని శ్రద్ధగా, సన్నిహితంగా గమనించు. ముఖాముఖి దాని ప్రక్రియ ఏమిటో తెలిసికో. దాన్ని గమనించటం వల్ల తెలిసికోవటం వల్ల, అది అదృశ్యమవుతుంది. అహంకారం తొలిగి పోతుంది.

* * *

# మతమంటే బూర్జువా ఆధ్యాత్మికత

సంస్థాగతమైంది మతంకాదు. ఆచార వ్యవహారాలు మతంకాదు. సంప్రదాయాలూ కట్టుబొట్టూ మతంకాదు. గ్రంథాలూ, గురువులూ మతం కాదు. ఈనాడు మతంపేరిట జరుగు చున్నదేది కూడ నిజమైన మతం కాదు. ఈ నాటి ఏమతంలోనూ మానవునికి స్వేచ్ఛ లేదు. స్వేచ్ఛలేనిదే వికాసంలేదు. కాబట్టి మతం మానవ వికాసానికే విఘాతమైంది. మతం పేరుతో మానవుడెంత క్రూరత్వానికైనా వెనుదీయుడం లేదు. మతంపై పెట్టుకున్న విశ్వాసమే అందుక్కారణం. కనుక నిజమైన మతం నమ్మకాలతో కూడింది కాదు.

మతాలూ, కులాలూ, ఇజాలూ మానవులను చిన్నాభిన్నం చేశాయి. మతమూ ధనమూ కలిసి జీవిస్తున్నాయి. క్రైస్తవంలో గానీ, ఏమతంలోగానీ మత సంస్థలు ధనాగారాలై పోతున్నాయి. మత సామ్రాజ్యాలు వెలుస్తున్నాయి.

"మతం బూర్జువా విధాన ఆధ్మాత్మిక తత్వమైంది. నిత్య జీవనం నుండి మతమనేది పూర్తిగా తొలిగిపోయింది."

తన్నుతాను తెలిసికొనడమే నిజమైన మతం. సంపూర్ణ మానసిక స్వేచ్ఛ గలదే నిజమైన మతం. మత పరమైన మనస్సు నిర్మలంగా సరళంగా వుంటుంది. అంతేగాక సునిశితంగా ఉంటుంది. అది నమ్మించేది కాకుండా, ప్రశ్నించేదిగా ఉంటుంది. స్పష్టంగా ఉంటుంది. గమనికతో ఉంటుంది. ఏకాగ్రతతో గాక అవగాహనతో ఉంటుంది. కోరుకునేదిగా కాక ప్రేమ పూర్వక మైందిగా ఉంటుంది. అలాంటి మనసు "what is" ఉన్నదాన్ని - గ్రహించగలదు.

మతమంటే దేవుడుకాదు, ప్రార్థనాకాదు. తనచిట్ట చివరి ప్రసంగంలో కృష్ణమూర్తి "మతమంటే ఏమిటి?" నా ప్రశ్న అర్థ

మైందా" అని ప్రశ్నించారు. "మన మెందుకు అంతగా (మతానికి) హత్తుకు పోయాము? దేనినీ నమ్మం అని ఎందుకు చెప్పం?.... దేవుడూ, డబ్బూ ఎప్పుడూ ఒకటిగా ఉన్నాయి. కేథలిక్కులు తమ చర్చిని అలాగే కట్టారు. రత్నాలూ రాసులూ విలువైన వజ్రాలూ, అద్భుతమైనవీ, అన్నీ అవే. మీకూ అలాగే ఉన్నాయి. ఇక్కడ అనేక దేవాలయాలూ, పూజా విధానాలూ, ఆరాధనలూ, అన్నీ నిజంగా అర్థంలేనివి". మతం -పేరిటా, సమాజం పేరిటా, చిన్న చిన్న సంస్థల పేరిటా జరుగుచున్న వ్యవహారాన్నీ, నిర్మాణమై ఉన్న నాగరికతనూ, చరిత్రనూ తీవ్రంగా ప్రశ్నించాలి. ప్రశ్నించి, పరిశీలించమన్నాడు.

"అన్ని గూళ్లనుండీ, అన్ని భయాలనుండీ మానవుని విడిపించాలని నాకున్నది. మతాలనూ, శాఖలనూ స్థాపించాలని గానీ నూతన సిద్ధాంతాలనూ, కొత్త వేదాంతాలను సృష్టించాలని గానీ నాకులేదు. అవనిపై గానీ, ఆధ్యాత్మిక ఆవరణలో గానీ నాకు శిష్యులు లేరు, అపోస్తలులు లేరు. నాకున్న దొక్కటే ఒకటి. మానవుని బేషరతుగా పూర్ణ స్వాతంత్ర్యం వైపుకు మరల్చుటే"

"భగద్గీతను బయటికి విసిరేయండి, బైబిల్‌ను తగలేయండి, ఖురాన్‌ను చించేయండి" - అని ఆయన అస్తమించే ముందు ఆకాశవాణి ఢిల్లీకేంద్రం వారు ప్రసారం చేసిన జె.కె. ప్రసంగంలో అన్నారు. రవీంద్రనాథ్ టాగూర్ సాహిత్యం చదువుతుంటే తత్వశాస్త్రం చదువు తున్నట్టుగా ఉంటుంది. సర్వేపల్లి రాధాకృష్ణన్ తాత్విక రచనలు చదువుతుంటే సాహిత్యం చదువుతున్నట్లుగా ఉంటుందని ఒక సందర్భంలో వ్యాఖ్యానించారు." 1

మతం స్వలాభా పేక్షతో కూడిన ప్రచారమైంది. ధన సంపన్నమైన. ఆధ్యాత్మికతతో ముడిపడి పోయింది. ఆనువంశిక

1 ఉదయం 19-2-86.

మైన బూర్జువాతత్వమైంది. ఒక నమ్మకం, ఒక సిద్ధాంతం, ఒక ఆరాధనాక్రమమైంది. మూఢనమ్మకాలు ముసుగులయినాయి. నిత్య జీవితంతో సంబంధం లేకుండా పోయింది. దేవుణ్ణి నమ్మవచ్చు, నమ్మకపోవచ్చు. ఆ నమ్మకం నిత్యజీవితంలో మన ఆశాపాశాల వ్యవహారంలో అర్థరహితమై పోయింది.. నీ బ్రతుకెట్లున్నా దైవాన్నో, రక్షకుణ్ణో, గురువునో నమ్ముకుంటే చాలన్నట్లు మతాన్ని వాడు కుంటున్నావు. ఇది మతంకాదు. ఆత్మవంచన అని గ్రహించాలి.

విశ్వాసం వేరు, వాస్తవం వేరు. విశ్వాసం బంధిస్తుంది. అధి కారం వల్ల, భయం వల్ల ఏర్పడుతుంది. స్వేచ్ఛలోనే వాస్తవం గోచరిస్తుంది. విశ్వాసం వాస్తవానికి దారితీయదు. రెంటికీ సంబం ధంలేదు. మతం విశ్వాసం మీద ఆధారపడింది. అందుచే మతవి శ్వాసం ద్వారా సత్యదర్శనం కాదు.

ఆలోచనలూ, అభిప్రాయాలూ, ఆరాధనలూ - అలాంటివన్నీ చేరి మతమై కూర్చుంది. దానినుండి సిద్ధాంతం, పౌరోహిత్యం, మౌఢ్యం, చిహ్నం, విగ్రహం, గుడి, గోపురం పుట్టుకొచ్చాయి. ఇంకా చావుకూ, పుట్టుకకూ వ్యాఖ్యానాలు వెలువడ్డాయి. వీటన్నిటి లోనూ 'అహం' ముసుగేసుకొని పెరుగుతూ ఉంటుంది. అహం లేని మనస్తత్వం ద్వారానే ప్రశాంతత యేర్పడుతుంది. అదియే సరియైన మత మనస్తత్వం. తెలిసిన తతంగం ద్వారా తెలియని దాన్ని తెలుసుకోవాలని ప్రయత్నిస్తారు. మనసు చేసే వర్ణన ద్వారా తెలిసినదంతా విషయసేకరణై, గతంలో పడిపోతుంది. గతస్మృతి, దైవం, సత్యంకాదు గదా!.

ప్రపంచంలోకి మానవుడు ఏకాకిగా వస్తాడు. ఏకాకిగా పోతాడు. ఈ మధ్యలో జాతులు, కులాలు, మతాలు, భాషలు, రకరకాల విశ్వాసాలు పెంచుకుంటాడు. తనచుట్టూ గోడలు కట్టుకుంటాడు. ఆ గోడలవల్ల అతడు అసలు సత్యం చూడలేక పోతాడు. ఎవరి చేయూతనో అర్థిస్తాడు. వేదాలనో, ఉపనిషత్తులనో, భగవద్గీతనో,

మరొక మత గ్రంథాన్నో సహాయం అడుగుతాడు. ఏ స్వామిజీనో, బాబానో, మతప్రవక్తనో, మతాచార్యుడినో, గురువుగా ఆశ్రయిస్తాడు.

"ఇదంతా వృధా, వృధాయేకాదు. దగా, అంతామోసం, వంచన, దోపిడీ. సత్యాన్వేషణకు ఇది మార్గంకాదు. ఎవరినీ ఎవరూ ఉద్ధరించలేరు. ఏ మతమూ, మఠమూ, పీఠమూ, విశ్వమూ ఏదీ సత్యదర్శనం చేయించలేదు. వీటిని నమ్ముకోవడం గుడ్డివాడిని ఊతగొనడం వంటిది. ఎవరికి వారే సత్యాన్ని అన్వేషించాలి. ఎవరికి వారే సత్యాన్ని కనుగొనాలి. ఏ గురువూ ఎవరికీ మార్గదర్శికాలేదు. 1

మత పునరుద్ధరణకు పూనుకోనవసరం లేదు. గతం గతం కానివ్వు. దానిలో క్రొత్తదనాన్ని కల్పించలేవు. నీయందు నీవు శ్రద్ధ చూపుకో. నీ నిజస్వరూపం నీవు తెలిసికో. నీ స్థితికి వ్యాఖ్యానం చేర్చి, సమర్థించుకోవద్దు. ముఖాముఖి, సరాసరి సాదాగా సిన్సియర్‌గా, సీరియస్‌గా గ్రహించుకుంటే నూతన జీవితం మొదలవుతుంది. ప్రేమ పుట్టుకొస్తుంది. మొత్తం జీవిత విధానమే మతం. అది మనసు యొక్క బింబం కారాదు. సత్యాన్ని, వాస్తవాన్ని అర్థం చేసుకొనేది కావాలి. ఇది జె.కె. సందేశసారం.

* * *

---

1. ఆంధ్రజ్యోతి సంపాదకీయం: 19-2-86

# గురువులున్నారు జాగ్రత్త !

గురువనగా పెద్దవాడు. సైనుబోర్డు లేక మార్గసూచి లేక దిక్సూచి లాంటి వాడు మాత్రమే. పాఠశాలలో పిల్లలకు పాఠాలు చెప్పే పంతులుగార్ని గురువు అంటారు. ముక్తిమార్గము చూపించే ఆధ్యాత్మిక తత్త్వవేత్తనూ గురువు అంటారు. మొదటి గురువుతో అభ్యంతరం లేదు. ఎంచేతనంటే, తాను - సర్వసమర్థుడని అను కోడు. సర్వజ్ఞుడుగా ఫోజు పెట్టడు. తాను అథారిటీనని అనడు. చదివే విధానం తెల్పుతాడు. విషయ విశదీకరణ చేస్తాడు. శాస్త్రం బోధ పరుస్తాడు. తానే మార్గమూ, జీవమూ, ధ్యేయమూ, సర్వ స్వమూ అనడు. పాదపూజలు, శిరోపూజలు గైకొనడు. పౌరోహిత్యం చేయడు. మంత్రాధిపత్యం వహించడు, మధ్యవర్తిగా మసలడు. ఇక రెండవ గురువు సర్వస్వమూ తానే నంటాడు. తనకూ దైవా నికీ భేదం లేదంటాడు. 'గురుర్బ్రహ్మా, గురుర్విష్ణుః.....' అని నమ్మిస్తాడు. ఇంక చాలాచాలా చేస్తాడు. చేయిస్తాడు, నటిస్తాడు. నటింపజేస్తాడు.

'నాకు తెలుసు అన్నవాడు తెలిసినవాడుకాదు. గురువుగా తయారై, బంధింపబడ్డ మనసుతోవుంటే జ్ఞానోదయం కాదు. గురువు సర్వజ్ఞుడు కాదు, సర్వశక్తిమంతుడు కాదు, రక్షకుడుకాదు. గురువు యొక్క అధికారాన్ని కృష్ణజీ కాదన్నారు.

మార్గాన్వేషణ ఎవరికి వారు చేసికోవాలి. ఎవరి సమస్య వారికి తెలియాలి. సమస్యను సూటిగా అర్థం చేసికొనుటలోనే పరిష్కారం ఇమిడి వుంది. మంత్రోపదేశాలూ, మహిమలూ, పూజలూ, ఆడంబ రాలూ, అర్థం లేనివి. అవి వికాసాన్ని కలిగించవు. వాటివల్ల కరుణ పుట్టదు. సరిగదా, అడ్డుగోడలై నిలుస్తాయి. కనుక గురువులేనట్టే, అథారిటీ లేనట్టే స్వేచ్ఛాన్వేషణ చేయాలి. అది సత్యశోధన కాగలదు.

1982 సెప్టెంబరు 12-18 సన్ డే స్పెషల్ వారపత్రిక ప్రకటించిన ఇంటర్వ్యూలో వివరాలు చూడండి. "నా మట్టుకు నాకు ఆధ్యాత్మిక ఆధారంకూడ ఒక కోరికే. అది బుద్ధిని సంకుచిత పరుస్తుంది. ఇండియాలోనే గాక, ప్రపంచమంతటా అలానే జరుగుతోంది.... గురువులూ, మతాధికారులూ, కాథలిక్ లోకమంతా అంతే" అని స్పష్టంజేశారు కృష్ణజీ. "నాకు అథారిటీ లేదు. నన్ను గురువును చేయవద్దు. నాకు అనుచరులు లేరు..... ఎందుకంటే సంఘాలూ, సంస్థలూ మానవుని రక్షించలేవు...... మూడువేల సంవత్సరాల నుండి గురువులున్నారు. వారే మంచీ చేయలేదు..... శంకరాచార్యులు మీకు తెలుసు. చిన్నప్పటి నుంచీ ఆ (గురువుల) గొడవలన్నీ చూసాను. అంతా ఇంతే! స్థానమూ, హోదా, అధికారమూ, ఆధ్యాత్మిక వ్యాపార ప్రాతినిధ్యమూ, ధనవలయం పన్నటమూ - ఇందంతా యేమిటి? మానవుల మనస్సులో మార్పు తెస్తే అద్భుతమే. కానివాళ్ళు ఏమీ చేయలేదు..... బాధ నుండి విడుదల కావడానికి మానవునికి సాయపడ్డారా, లేక వాళ్లవాళ్ల విశేషాలూ, ప్రత్యేకతలూ మనుషుల మీద రుద్దారా?"

అనిబెసెంటు 1911 లో ప్రాగ్దేశ తారా పరిషత్తు (order of the star in the east) ను స్థాపించి కృష్ణమూర్తిని దానికి అధిపతిని జేసింది. ఆయన్ని జగద్గురువుగా ప్రకటించింది. దానికి హాలెండులో (ఓమెన్‌లో) గొప్ప ఆస్తులు చేకూరాయి. 1929లో దానిని పరిత్యజించి, దానికి చెందిన అపార ఆస్తిపాస్తులను (5000 ఎకరాలు, భవనాలు) కృష్ణమూర్తి తిరిగి యిచ్చి వేసాడు. తాను గురువుకాదని ప్రకటించాడు. 1930 లో దివ్యజ్ఞాన సమాజ సభ్యత్వానికి కూడ రాజీనామా చేశాడు. బంగారు పంజరం పట్ల, గురుభావం పట్ల కలిగిన జుగుప్సనుండి బయటపడ్డారు. పరమత్యాగియైనారు. కృష్ణమూర్తిని "గురువు కాని గురువని" ఆంధ్రజ్యోతి కీర్తించింది. 1

1 19-2-1986

గురుశిష్య సంబంధంలో ఎంత దోపిడీ వున్నా, అది వారిద్ద రినీ ఉన్నత వ్యక్తులుగా చిత్రించి తృప్తినిస్తుంది. దీనికి నమ్మకమే ఆధారం. ఇది భయంకర ఆయుధంలాగ పనిచేస్తుంది. సరైన అవ గాహనకు అడ్డుగోడ అవుతుంది. "నీ దారి నీది, నా దారి నాది ఏనాటికైనా మనమిద్దరం ఒకచోట కలుస్తాము" అనేది కూడ నమ్మకంలో ఒక సర్దుబాటే. అనుసరించుటలో లేక అనుకరించు టలో వికాసంలేదు. ఆలోచనా పరులలోనూ, అనాలోచనా పరు లలోనూ అధికారమెప్పుడూ అవినీతికరమైందే. భద్రతా, రక్షణా, లాభమూ, జయమూ కాంక్షించి ఉపదేశం కోరతారు. పైగా చిత్తం స్థిమితంగా, శాంతంగా లేనపుడు గందరగోళంనుండి కాపాడ తారనే కాంక్షతో గురువుని ఆశ్రయిస్తారు. అతడ్ని సద్గురువనీ, జగద్గురువనీ, గురోర్గువనీ, సూపర్ గురవనీ, దేవతనీ, పరదేవతనీ బ్రహ్మ - విష్ణు - పరమాత్మనీ తోచిన రీతిని భావించటం మనసు చేసే మాయా జాలమై పోయింది. సామాజిక రాజకీయరంగంలో వలెనే మతపరంగా కూడా గురువు చలాయిస్తున్నాడు.

గురువు తెలిసినవాడు, శిష్యుడు తెలియని వాడనే విభాగం శాశ్వతంగా ఉండిపోయింది. ఇంకా ప్రేమకు స్థాన మెక్కడ? గురువుప్రేమ గూర్చి మాట్లాడినా, శిష్యుడు భక్తి ప్రదర్శించినా ఇద్దరి సంబంధమూ ఆధ్యాత్మికమైంది కాదు, భ్రమ సహితమైంది. ఇకపోతే ప్రతి గురువూ తన పద్ధతీ తన పంథా తన ధ్యానమూ ఉన్నతమైనదని చెపుతాడు. సత్యం దరిజేర తనది ఏకైక మార్గ మని నిర్వహిస్తాడు. అది అలావుండగా ఒక గురువు శిష్యుడు ఇతర గురువులను అనుసరించడం కూడా వుంది. ఈ సహనం అంగీకారంగా కన్పించే నాగరీకమైన విభాగం. ఇలా రాజకీయంగా, మతపరంగా, సామాజికంగా మనుషుల మధ్య విభాగాలేర్పడ్డాయి. మానవ మేధస్సు ఇలాంటి చక్కటి విభాగ మార్గాలేర్పరచింది. ప్రతి విశ్వాసీ ఎవని గూటిలో వాడు సుఖం పొందుతున్నాడు. ఈ విధంగా ప్రపంచం విచ్ఛిన్నమై పోయింది.

విజ్ఞానశాస్త్రం, వైద్యశాస్త్రం, సాంకేతికశాస్త్రం గూర్చి బోధించటం అర్థవంతమైంది. కాని తనకే అనుమానాస్పదంగా వుండే తత్వం గూర్చి, సత్యం గూర్చి నిర్ధారిస్తూ చెప్పడం అవాస్తవమవుతుంది. నిత్యవికాసం, నిత్యజీవం, నిత్య చలనం కలిగిన సత్యం గతగాథలాగ వర్ణించబడేది కాదు.

గురువు వల్ల ప్రమాదం ఏర్పడుతోంది; అది అధికారంవల్ల కల్గుతోంది. అధికారంలో స్వేచ్ఛ, ప్రగతి ఉండవు. పాత గురువైనా ఒకటే కొత్త గురువైనా ఒకటే. నగిషీలో తేడా తప్ప వస్తువొకటే. గందరగోళముంటేనే అధికారం పని చేస్తుంది. గురువు మాటలూ, చేతలూ, శ్రద్ధగా గమనిస్తే వాటిలో ఉన్న భయం, బలహీనత, వ్యతిరేకత, స్వార్థం బయట పడతాయి. అసలు వారికి తెలిసిందేమిటని స్వతంత్రశ్రోతకు ప్రశ్నపుట్టక పోదు. అర్థంగాక పోదు. పుస్తకాల్లో ఉన్నదే పుక్కిటి పడతారు. గతమనోనిబద్ధత ప్రకారమే పలుకులు పలుకుతారు. సేకరించిన సమాచారాన్ని మాట పొందికలో ఇముడ్చుతారు. వారికి సమాచారజ్ఞానం వుంటుంది. కాని ప్రేమ వుండదు. ప్రేమలేని జ్ఞానం నిరుపయోగమే కాదు, నాశనకరమైంది.

పూజనీ, గురువనీ, దేవతనీ, జాతనీ పేరుపెట్టుకొని ఉదరపోషణకూ, మెదడు వాపుకీ కృషిచేయటం జరుగుతోంది. గురువుండనీ లేకపోనీ ఒక పద్ధతికూడ కాలబద్ధమైందే. ఆలోచనా బద్ధమైందే. ఆలోచన గతంమీద ఆధారపడిందే గదా! అందునవ్యత లేదు. అది వర్తమానానికి కావలసింది కాదు. పద్ధతి కేంద్రం లాంటిది. కేంద్రాన్ని కాకుండా మొత్తాన్ని చూడటం నేర్చుకోవాలి. అయితే నిర్భయత్వం, నిర్మోహత్వం, నిష్కామత్వం, నిరధికారత్వం కలవారు, విద్యార్థులకు సృజనాత్మకమైనట్టి దారి సూచించగలరు. స్వేచ్ఛాయుతమైన అవగాహన కలుగ జేయురీతిలో త్రోవచూప వచ్చును. కాని తన స్థితి తాను తెలిసికోకుండా ఇతరుల ననుసరించటం గ్రుడ్డిగా అనుకరించటమే.

మరణించే ముందు కృష్ణజీ కౌన్సిల్ సభ్యుల్ని సమావేశపరచి "ఇదినా అంతిమ సందర్శనం, నన్నొకదైవాంశ సంభూతుణ్ణి చేయ కండి. ఇదొక్కటే నా విన్నపం. నాకెవరూ భక్తులు లేరు. నాకోసం స్మారకమందిరం గానీ, దేవాలయం గానీ నిర్మించకండి. అలాగనక చేస్తే నాబోధనలన్నీ నలిగిపోతాయి" అని అన్నారు. దానికి అను గుణంగా ఎటువంటి కర్మకాండగాని, ప్రార్థనలుగానీ, మంత్రోచ్చా రణలుగానీ లేకుండా అతిసాధారణంగా ఆయన భౌతిక కాయాన్ని దహనం చేశారు.

* * *

# నీవు సృష్టించుకొన్నదే నీ దైవం

ఈ లోకంలో మనకు అనేక విషయాలు తెలియవు. సృష్టిలో అనేక సంఘటనల విషయం తెలియదు. జ్ఞానేంద్రియాలకు కూడ అందని విషయాలు ఉండవచ్చు. పంచభూతాలకు మించిన వస్తువులు ఉండవచ్చు. వ్యక్తమైన ప్రపంచం వుంది. అవ్యక్తమైనది కూడ ఉన్నదనవచ్చు. అవ్యక్తమనగా బయటకు రానిది, ప్రకటనకానిది. అదే తెలియనిది. తెలిసిన దానితో తెలియని దాన్ని తెలుసుకోవాలని యత్నిస్తున్నాము. తెలియని దానికి అనేకపేర్లు పెట్టాము. సంజ్ఞలు కూర్చాము. ఆకారాలు కల్పించాము. ఆకారం లేదన్నాము. అన్ని ఆకారాలు అదే అన్నాము. గుణాలు కుప్పించాము. గుణం లేదన్నాము. ఈ విధమైన అనేకానేకములలో దైవం ఒకటి లేక దేవుడొకడు. అది పర్యాయపదంగా వాడబడింది.

దేవుని పేర స్తోత్రాలూ, వర్ణనలూ, కథలూ, సంఘటనలూ, తత్వాలూ, వ్యవహారాలూ, పుస్తకాలూ, నిర్మాణాలూ, కోకొల్లలు. కొండలకు మించిన వాఙ్మయం పెరిగింది. సముద్ర తరంగాలకు మించిన భావాలు చెలరేగాయి. ఇందులో కొన్ని అనుకూలమైనవీ కొన్ని వ్యతిరేకమైనవి. కొన్ని పరస్పర బద్ధ విరోధమైనవి. కొన్ని సమన్వయం కలవీ. ఇంకా ఆస్తిక ప్రచారానికి పోటీగా నాస్తికత్వం ప్రబలుతోంది. ఇంత గందరగోళంలో వాస్తవమేమిటో తెలుస్తుందా? దైవమేమిటో బయట పడుతుందా? పైగా ఎవరిదైవం వాళ్లదీ, ఎవరి విశ్వాసం వాళ్లదీ, అని సరిపెట్టుకోవటం కూడ సత్యమవుతుందా? స్వానుభవమౌతుందా? వ్యవహారంలో నప్పుతుందా? ఒకవేళ వ్యవహారానికే అతీతమైతే అది నిత్యజీవితానికి అవసరమా?

మనసుచే సృష్టించ బడ్డది దైవం. భావం - ప్రతిమ, రెంటినీ మనస్సే కల్పించింది. మనసుకు సుఖమూ, క్షేమమూ, భద్రతా కావాలి. అందుకు దైవం తోడు కావలసి వచ్చింది. అయితే దైవ విషయం మానవ సమస్యలకు సంబంధం లేకుండ ఉండిపోయింది.

మనసు నుండి ఉత్పన్న మైంది ఏదైనా కాలానికి కట్టుబడి పోతుంది. మనసు భగవంతుని కనిపెట్టినా, స్వర్గాన్ని సృష్టించినా అది కాలానికీ, గతానికీ బద్ధమైనదే అందుకే అది అవాస్తవం. భయంనుండి కాపాడుకోడానికీ, ఆందోళన నుండి రక్షణ పొందడానికి మానవుడు దైవభావాన్ని ఆశ్రయిస్తాడు. తనకు సంరక్షణ చేకూరుతుందనే విశ్వసిస్తాడు. నమ్మకమనేది ఆస్తికం పట్లా ఒకటే, నాస్తికంపట్లా ఒకటే.

కృష్ణమూర్తి ఇలా చెప్పారు - "దేవుడంటేనే క్రమం లేనిది..... మనిషి సృష్టించిన లెక్కలేనంత మంది దేవుళ్ల విషయం చూడండి, లేక ఏకైక రక్షకునే చూడండి. ఇది లోకంలో నింపిన గందరగోళమూ, తెచ్చి పెట్టిన యుద్ధాలూ, కల్గించిన విభాగాలు, క్రమరాహిత్యమూ ఇంతా అంతాగాదు." "ఈ గోడల మధ్య ఉన్న దేవుళ్ళందరూ అబద్దపు దేవుళ్లే. వాళ్ళ గురించిన వ్రాతలూ వేదాంతాలూ అర్థం పర్థం లేనివి. ఎందుకంటే జీవితము వాటికి మించినది."

1980 సెప్టెంబరు 12 - 18 సన్డే వారపత్రిక ఇంటర్వ్యూలో "దేవుని నమ్ముతారా?" అని ప్రశ్నించినపుడు "లేదు, లేదు, లేదు, నేను నమ్మను. నమ్మకమనేది ప్రమాదకరమైన పదం. దేవుణ్ణి మనిషి సృష్టించాడు. దేవుడు నిజంగా ఉండీ, మనిషిని తన రూపంలో తయారు చేసి ఉంటే అతడు కూడ చాలా చెడిపోయిన వాడయి ఉండాలి. కాని మనం ఒక ఆధారభూతుణ్ణీ, మంచివాడినీ తండ్రిగా కోరతాము" అని సమాధానం చెప్పారు. అంతేగాదు. మానవుడు సృష్టించిన దేవుళ్లకు మించిన క్రొత్త దేవుళ్లను కంప్యూటర్లు కనిపెట్ట బోతున్నాయనీ, మానవ మేధస్సు ఏమి కానున్నదోననీ -బాధపడ్డారు.

కాలానికి పరిమితమైన శక్తులు అనేకం గలవు. కాని కాలానికి కట్టుబడని శక్తి ఏమైనా ఉందా? ఈ ప్రశ్నకు సమాధానం దొర

కక దైవాన్ని కాలాతీతుణ్ణి చేశారు. కాలాతీతుణ్ణి చేయటం కూడ కాలం అనే పరిధిలోనికి తీసుకొని రావటమే అవుతుంది. ఇది విభజనతో కూడింది. కాలం విభజనాత్మకమైంది. విభాజ్యమైన మనస్సు కాలాతీతమైన శక్తిని కనిపెట్టాలని చూస్తుంది. దేవుడని పేరు పెట్టి పూజిస్తుంది. ఇదంతా కాలానుబద్ధమే!

స్థిమిత పడ్డ మనస్సు దేవుని గురించి ఏమీ అడగదు. దరిద్రపు మనస్సు మాత్రమే దేవురిస్తుంది. బ్రతిమలాడుతుంది. అది అడిగేదేదీ దానికి లభించదు. ఎందుకంటే అది నిజంగా కోరేది భద్రతా, సుఖమూ, శాశ్వతత్వమూ. దేవుణ్ణి గూర్చి ఏమికోరినా నీవు దేవుణ్ణి కనుగొనలేవు".

"ఒక ప్రత్యేక సమాజం దేవుణ్ణీ, సాంఘిక విభాగాన్నీ, విశ్వసించమని నిన్ను నిబంధించింది. మరొకటి దేవుడు లేడని, వేరే సిద్ధాంతాన్ని నమ్మమని నిబద్ధించింది. ఇరువురూ తమతమ నమ్మకాలను బట్టి అనుభవం పొందుతుంటారు. కాని అలాంటి అనుభవం కూడ వాస్తవం తెలిసికోడానికి అడ్డంకే". ఎందుకంటే ఈ అనుభవమూ, జ్ఞానమూ లేక స్మృతీ ఒకస్టేజీలో అవసరం కావచ్చు. కాని అవి అహంకారాన్నీ మమకారాన్నీ పెంచేవయితే భ్రమలోనూ దుఃఖములోనూ ముంచేస్తాయి."

భయాన్ననుసరించి దైవ విశ్వాసం, దాన్నిబట్టి నిబద్ధత, దానిని బట్టి దైవానుభవం ఏర్పడతాయి. పిరికి తనమే దైవభావానికి ఊత అవుతుంది. అనగా దైవం భయాన్నుండి ఉద్భవించింది. కాబట్టి అద్భుతమైన దైవానుభవం మనిషిలో నుండి ఉత్పన్నమైందే. దైవానుభవమనే మత్తును పెంచి పోషించడానికి కుక్కగొడుగులు చాలా పుట్టుకొచ్చాయి. అందులో సోమరసమొకటి. అక్కడినుండి ఇండియాలోనూ ఇతరదేశాల్లోనూ వివిధ రకాల మత్తుమందులు తయారైనాయి. గంజాయి, జానపత్రి, హషిష్, యల్.యస్.డి., మరిజానా, పానీయం, హిరాయిన్, ఇత్యాదులు!

మతం విశ్వాసపరమైంది. విశ్వాసం మనస్సును సంకుచిత పరుస్తోంది. స్వేచ్ఛతో కూడిన మనస్సుంటే గాని సత్యమంటేమేమిటో దైవమంటే ఏమిటో తెలిసికోలేవు. నమ్మకం పనిచేయదు; ఎందుకంటే దేవుడెట్లుండాలని నీవు ఆలోచిస్తావో, దేవుణ్ణి గూర్చి ఏది నిజమని తలుస్తావో నీ నమ్మకం దాన్నే ప్రతిబింబిస్తుంది. దేవుడు ప్రేమా, మంచీ, ఇదీ, అదీ అని నమ్మావంటే, నీ నమ్మకమే దేవుణ్ణి లేక సత్యాన్ని సదవగాహన జేసికోవడానికి అడ్డువస్తుంది. కాని నమ్మకం ముసుగులో నిన్ను నీవు మరచిపోవాలని కోరుతున్నావు. నిన్ను నీవు కోల్పోవాలని కోరుతున్నావు. ఇతరులను అధిగమించాలని ఇచ్ఛగిస్తున్నావు. నీలోని ఘర్షణ వదిలించుకోవలనుకుంటున్నావు. పవిత్రుడవు కావాలను కొంటున్నావు. మాటలను వదలి అంతర్గతంగా అర్థంచేసికొంటే, మేల్కొన్న తెలివి ద్వారా సృజనాత్మకమైంది వెలువడుతుంది. అదే వాస్తవం, దైవం. కాని అది ధ్యానించ తగిందీ, ఊహించ తగిందీ కాదు.

ఊహలకు పుట్ట, ఆలోచనలకు ఊట, స్మృతులకు నిలయం ఈ మనసు. దాని ద్వారా తోచిన రీతిని భగవంతుని సృజించుకొన్నాము, పవిత్ర పుస్తకభాండాగారాలు నిర్మించు కొన్నాము, ఆరాధనలు పెంచుకొన్నాము. పలాయన పద్ధతిలో జీవిత సమస్యలకు దూరమైపోతున్నాము. కాలానికి కట్టుపడని నిత్య చైతన్యం లేక చలనం ద్వారా మాత్రమే దైవత్వమనబడే సత్యత్వం ప్రాప్తమవుతుందని కృష్ణమూర్తి పదే పదే చెప్పారు.

నమ్మకం వేరు, వాస్తవం వేరు. ఒక్కటి బంధానికి దారి తీస్తుంది. రెండోది స్వేచ్ఛతోనే సాధ్యం. ఒకదానికొకటి సంబంధం లేనివి. నమ్మకం సత్యానికెన్నడూ దారి తీయదు. కండిషనింగ్ (నిబద్ధించడం) యొక్క ప్రతిఫలం నమ్మకం. అది భయంవల్ల ఉత్పన్నమైంది. లేక అది అంతర్గత అధికారానికో లేక బహిర్గత అధికారానికో పుట్టింది. అది సుఖాన్నిస్తుంది. కాని ఇందులో ఏదీ సత్యం కాదు.

# సత్యం బాటలేని చోటు

ఉన్నది ఉన్నట్లుగ, లేనిది లేనట్లుగ గ్రహించడమే సత్యం. అంతే గాదు సత్యమనబడుదానిలోని అసత్యం, అసత్యమనబడుదానిలోని సత్యం గ్రహించడం సత్యం. ఎప్పటికప్పటిదే సత్యం. అనుభవైక వేద్యమైంది సత్యం.

"సత్యం పంథాలేని ప్రదేశం. మతం ద్వారా గానీ ఏ విభాగం ద్వారాగానీ చేరలేవు...... క్రొత్త గూళ్ళ తయారీతో నాకు పనిలేదు. మానవులకు సాంగోపాంగంగా, బేషరతుగా స్వేచ్ఛ ఇవ్వ డమేనా పని".

"సత్యమనేది దేవాలయాల్లో లేదు, పూజా గృహాల్లో కని పించదు. అవి అంధకార బంధురాలు. సంప్రదాగత సమాజాలు వెలిగించిన చక్కని సుందర సభాలయాల్లో అగుపించదు. ఉత్సవా ల్లోనూ, పుస్తకాల్లోనూ లేదు" ఎవరికి వారు శోధించుకొని, వెలికి తీసుకోవాలి.

'అన్ని రోడ్లూ రోంకు దారితీస్తాయి' అనే సామెత వుంది. అది సత్యాన్ని నిర్ధారించే మార్గంకాదు. పోల్చుకొని ఊరట పొందడానికే. అసలు సత్యానికేదో ఒక్క మార్గమున్నదనిగానీ అనేక మార్గాలు న్నాయనిగానీ అనడం తగదు. "ఏకం సత్ విప్రాబహుధా వదంతి" అనే సూక్తి చెప్పే వారికి చెల్లుతుందేమోగాని వినేవారందరికీ కాదు; మనకు తెలియంది గనుక సత్యం శాశ్వతమైంది అనేది మరో ఆర్యోక్తి. ఇవన్నీ కృష్ణజీకి సమ్మతం కాదు. నిర్ణీత మార్గం లేనిది సత్యం. సత్యం ఎవరికి వారు పొందే ప్రమాణం. ఇది నిజాయితీతో కూడిన అవగాహనవల్ల లభిస్తుంది. పరిప్రశ్న ద్వారా, గమనిక ద్వారా పొందవలసింది.

స్వేచ్ఛా మనోదర్పణంలో వివేక ప్రతిబింబమనే ప్రజ్ఞ ఉద్భవి

స్తుంది. దాని ద్వారా సత్యదర్శనం అవుతుంది. అదే వివేకము, అదే ప్రేమ, అదే కరుణ.

"సత్యమంటే యేమిటో దైవమంటే యేమిటో తెలుసుకోవా లంటే సంస్కృత శబ్దాలు వల్లెవేయటం వల్లా, అంగన్యాస, కరన్యాస, విన్యాసాలు చేయటం వల్లాకాదు. ధ్యానించటం తెలియాలి. అది చాలా వేరైన విషయం. అది పూజకాదు. లక్షల కొద్ది మనుషులు పూజలు చేస్తున్నారు. దాని వల్ల లోకానికి మేలేమైనా కలిగిందా? అసలు వాళ్ళు సృజనాత్మకమైన వారా? అలా సృజనాత్మకంగా ఉండాలంటే ఎంతో చొరవా, నిండైన ప్రేమా, దయా, సానుభూతీ, అనుకూలతా ఉండాలి. చిన్నప్పటినుంచీ పూజ ప్రారంభించి అదే పనిగా పునశ్చరణ చేస్తూ పోతే జీవితం యాంత్రికమైపోతుంది.

"కనుక బాల్యం నుండి తల్లిదండ్రులకో సంఘానికో భయపడి నిబద్ధంకాకూడదు. నిబద్ధత లేకుంటే సత్యాన్వేషణ కవసరమైన కాలబద్ధముగాని చైతన్య కదలిక నీలో వుంటుంది. సత్యాన్ని తెలిసికొన్న వారు మాత్రమే నవీన నాగరికతను, నవీన సంస్కృతిని సృష్టించగలరు. కాషాయ వస్త్రాలు వేయవచ్చును. ఆయా సంస్థలలో, శాఖలలో చేరవచ్చును. వాస్తవాన్ని కనుగొనే చలనం నీలో లేకపోతే నీవు చేసేవన్నీ వృధా. పండితుడుగా గౌరవం పొందవచ్చు. అదంతా సంస్కృతి యనబడిన ఖైదీ గోడలమధ్య మాత్రమే"

సత్యం శాశ్వతమా? శాశ్వతమంటే అహర్నిశలూ నిలిచి ఉండాలి. అది సతతమట్లే యుండేదికాదు. అలా ఉంటే సత్యం కాదు. క్షణక్షణమూ దానిని కనిపెట్టాలే గాని, గుర్తుపెట్టుకొనేది కాదు. గుర్తుంటే చచ్చిన దాంతో సమానం. సత్యం సజీవమైంది. అవి జ్ఞానంతోనూ, అనుభవంతోనూ బరువెక్కింది కాదు.

అది మతానికీ, దేశానికీ, జాతికీ కట్టుబడింది కాదు. అది దేవాలయంలో, చర్చిలో, మసీదులో లభించేదికాదు.

మనిషికి నిజమైన పని యేమిటి? నిజమైన పని సత్యాన్ని కనుగొనటమే! అదే ప్రేమించటం. స్వార్థాన్ని కప్పిపుచ్చే కార్యక్రమంలో తగుల్కోవటంకాదు. సత్యశోధనలోనే ప్రేమ ఉంది. ఆ ప్రేమే మనిషికీ మనిషికీ గల సంబంధం. ప్రేమ క్రొత్త ప్రపంచాన్నీ, నాగరికతనూ సృష్టిస్తుంది.

"శంకరుడో, బుద్ధుడో, ఏ మేధావియో చెప్పింది నమ్మి ఊహాగానాలు చేస్తే పరిశోధించి నట్లుగాదు. నిజనిర్ధారణ ప్రయత్నం అదిగాదు. దానికొక పనిముట్టు వుంది. అది మనస్సు. అదే మెదడు. కాబట్టి ఇందుకు మనోమార్గాలూ, ధర్మమూ తెలిసివుండాలి. మనస్సును సంకుచితత్వము నుండీ, కట్టుబడడం నుండీ, భయం నుండీ, జ్ఞానం (విషయ సేకరణ) నుండీ శుద్ధి చేయాలి. సరళంగా, సామాన్యంగా, చురుకుగా, అమాయకంగా మనస్సు ఉంటే, దానికి మించిన సత్యాన్ని కనిపెట్టగలదు".

"కాళ్ళదగ్గరుండే సేవకుణ్ణి వదలి ఏ లోకంలోనో ఉండే గురువు కొరకు వెతికినట్లుంది మన సత్యాన్వేషణ. మన దగ్గర దాన్ని వదలి దూర తీరాలలో వెతకడానికి తిరుగుతుంటాము. మనకు సౌందర్యం ఎక్కడ వుంటుంది? ఇక్కడ కాదు. మనకింట్లో సత్యం గోచరం కాదు, బహుదూరంలో. సామాన్య ఈతిబాధలూ సంతోషాలూ అర్థం చేసుకోము. అవ్యక్తంగా నున్న అద్భుతాలను బుఱ్ఱ కెక్కించుకోటానికి ప్రయత్నిస్తాం. మనల్ని మనం తెలుసుకోము. తెలియని వాడు ఊహాలోకాలలో చూపే వాగ్దానాలకొరకూ, ఆశల నిమిత్తమూ సేవచేస్తుంటాడు. మనం గందరగోళంగా ఉంటే, మనం కోరేది కూడా గందరగోళమే. మనం అర్థాంధకారంతో చూచేది పాక్షికంగానే ఉంటుంది కాని సత్యంగా ఉండదు.

"గతానుభవం సత్యంకాదు.... సత్యాన్ని అనుభవిస్తున్నాము, అనే వాడిది భ్రమమాత్రమే. నిజానికి జ్ఞానమంతా భ్రమ మాత్రమే.

అనుభవం జ్ఞానానికి రూపమిస్తుంది. జ్ఞానం అనుభవాన్ని లొంగ దీస్తుంది. సత్యమున్నదనటానికి అనుభవమూ జ్ఞానమూ రెండూ తొలగాలి". అంతేగాదు, ఒక పద్ధతినీ దాని ఫలితాన్నీ ముందే నిర్ణ యించుకోకూడదు. ఉద్దేశంలేకుండా అన్వేషణ ఉంటుందా? ఉద్దే శముంటే అన్వేషణౌతుందా? ఉద్దేశముంటే అన్వేషణ సంతృప్తి నిమిత్తమౌతుంది గాని సత్యం నిమిత్తంకాదు. కనుక పద్ధతీ, ఫలి తమూ, ఈ రెండూ అవగాహనకు ఆటంకం. కనుక ఎన్నిక లేని ఎఱుక (choiceless awareness) అన్వేషణకు అవసరము. తద్వారా ఉన్న వాస్తవం తెలుస్తుంది.

"ఆలోచన అంతమయితేగాని సత్యం అవగాహన కాదు. ఒకరు ఒకరికి చెప్పేది సత్యంకాదు. అది చెప్పబడేది కాదు. దాని గురించి ఒకరినొకరు సిద్ధం చేయలేరు. దానిని స్వీకరించడానికి సమర్థుడై ఉండాలి.... బహిర్గతంగా, నిష్కపటంగా, స్వేచ్ఛగా, అనుకోని రీతిగా దాన్ని సమీపించాలి.

"వైజ్ఞానిక వాస్తవాలలాగే సత్యం వ్యక్తిగత మార్గబద్ధమైందికాదు. అభిప్రాయానుగుణ్యమైందీ కాదు. దానికనేక మార్గాలూ అనేక రీతులూ అంశాలూ అవస్థలూ ఉన్నాయనడం కూడా అబద్ధం; ఇది సహనం లేనివాడు సహనంగా ఉండడానికి చేసే ప్రయత్నం. అదికేవలం ఊహాత్మకమైంది.

"సత్యం నమ్మకంపై ఆధారపడిందనే వాదం స్వీకరింప తగ్గ దికాదు. తిరస్కరించ తగ్గది. బుద్ధిని బట్టీ, వివేకాన్ననుసరించీ సత్యం నిరూపించ వచ్చనే వాదన కూడ సరైందికాదు. నమ్మకం కట్టుబడడం వల్ల వచ్చింది కనుక, ముందుగా పూర్తి స్వేచ్ఛ పొందితే కదా తెలిసికొనడానికి వీలవుతుంది? నమ్మకం అనుభవాన్ని ఆలోచనాత్మకంగా ముందుంచుతుంది. అనుభవం నమ్మకాన్ని బల పరుస్తుంది.

"ఆలోచనాప్రవాహఫలితంమైంది కాదు వాస్తవం. హృదయంలో ఖాళీని చింతనతో శబ్దాలతో నింపుతున్నాము. కొత్త కొత్త తత్వాలు కనిపెట్టడంలో మనం తెలివిగల వాళ్ళ మౌతున్నాము. వాటి ఓటమి కూడ మనకు తెలుసు.... జ్ఞానీ, సన్యాసీ, వాస్తవాన్ని కనుగొనలేరు; ఎందుకంటే వారిద్దరూ జ్ఞానీ, సన్యాసీయని యంగీకరించే సంస్కృతిలో భాగమే. అటుచూడండి; పావురం ఎగిరిపోయింది, మేఘం గిరిని కమ్మింది; సౌందర్యం భూమిపై వ్యాపించింది - అక్కడుంది సత్యం. అక్కడ మనం చూడం".

"సత్యము చిట్టచివరిదా? ఒకసారి సత్యం కనుగొంటే అన్ని ఆందోళనలూ తొలుగుతాయా? భయాలు తొలుగుతాయా? లేక వేరేవిధంగా పనిచేస్తుందా? ఒకసారి రైలెక్కగానే గమ్యం చేరిన ట్లేనా? ఇవన్నీ పరిమితమైన ఆలోచనలు. సత్యం కాలంలో ఒక కేంద్రమా? 'నేను' అనే కాలంలో సత్యం ఒకబిందువు కాదు.

"ఏ పేరు పెట్టినా సత్యమనేది, నిత్యమూ నవీనంగా, సజీవంగా వుండాలి; అంటే స్థాణువుకాదు, చచ్చిందికాదు, మనిషి మనసులో స్థిరమైన బిందువుకాదు. నిమిష నిమిషానికి నూతనంగా కనుగొనాలి. చర్విత చర్వణం అనుభవంకాదు; అది ఎడతెగక సాగుతూ ఉండేది కాదు. కాలరహిత (timeless) స్థితికాదు. అనేకానికీ, ఏకానికీ మధ్యనున్న విభాగం తొలిగితే సత్యముంటుంది".

సత్యం సాధించేది కాదు. సాధించే దానికయితే జ్ఞానమూ, ధనమూ కావాలి. దానితో గురువు - శిష్యుడు, తెలిసినవాడు - తెలియనివాడు తయారవుతారు.... ఒకటి సాధించడానికి మరొకటి త్యజించడం త్యాగం కాదు. అసత్యం అసత్యంగా, సత్యం సత్యంగా గ్రహించడం వివేకం లేక విజ్ఞానం.

భౌతికంగా సాధించేదయితే సమయమూ, ఓర్పూకావాలి. అవగాహనయితే తక్షణమేర్పడుతుంది. దానికి కాలవ్యవధి అక్కరలేదు.

ఇకపోతే ఇది అసత్యమని తెలియగానే దాని స్థానంలో ఏముంటుంది అని సంశయించరాదు. స్వేచ్ఛ ఏర్పడుతుంది. అసత్యం సత్యంతో పోల్చతగింది కాదు. అసత్యం పోతేగాని సత్యముండదు. హింస తొలిగితేగాని ప్రేమపుట్టదు. హింసానివృత్తికి కాలంతో (సాధనతో) పనిలేదు.

సత్యమనేది విచిత్రమైంది. నీ వెంత వెంటపడతావో అది అంత తప్పించుకొంటుంది. ఎంతో సూక్ష్మమూ ఎంతో యుక్తి యుక్తమూ అయిన సాధనతో సైతం దాన్ని వశం చేసుకోలేవు. ఆలోచన అనే వలలో దానినట్టిపెట్టలేవు. ఇది గ్రహించు. మిగతా వాటిని వదిలి పోనీయ్. జీవితంతోనూ, చావుతోనూ కూడిన యాత్రలో ఏకాంతంగా పయనించు; భద్రత నిమిత్తం మనసు సృష్టించుకున్న వాటినన్నిటినీ విసర్జించి వేయి.... సంపూర్ణమైనట్టి, ఏ మాత్రం ధూళిదూసరితం కానట్టి ఏకాంతం అవసరం.... నీవు సత్యం వెంటపడనవసరం లేదు; అసత్యం తొలగగానే సత్యం వెలువడుతుంది.

* * *

# ధ్యానం ధ్యేయమూ కాదు, సాధనా కాదు

ధ్యానమనగా బుద్ధికి సంబంధించింది, మనసుకు సంబంధించింది. మనసును శక్తివంతం జేసి కొనడం, మనః శక్తిని మిక్కిలి అధి కంగా జేసికొనడం, హెచ్చింపు జేసికొనడం, మనో పరిపూర్ణతమా ప్రశాంత స్థితినీ పొందడం. అదే ధ్యానం యొక్క పరాకాష్ఠ.

ధ్యానమనగా విశ్వబ్దత కాదు, ఆలోచనకాదు, మననం కాదు, మంత్రం కాదు, ముభావమూ కాదు, మత్తుకాదు, భగవచ్చింతన కాదు, ప్రయోజనా ధ్యేయం కాదు, ఏకాగ్రతకాదు.

మనసు పోషించబడే పెంపుడు జంతువుకాదు, భయకంపితమైం దికాదు, శిక్షించబడిందికాదు, శిక్షణ గరపబడిన పశువుగాదు, అగాధ జలము వలె నిశ్చలమైంది, సజీవమైంది, చలనం కలిగింది, బాహ్య ప్రపంచంతో సంబంధం కలిగింది. అయితే అది అంటీ అంటనిది, ప్రేమలాంటిది, వెలుగు లాంటిది, నిండైన నదిలాంటిది.

భారతదేశంలో అమష్ఠిస్తున్న తీరును బట్టి ధ్యానం జీవితం నుండి తప్పించుకోవట మవుతుంది.

మనస్సును ఖాళీచేయడానికీ నూతనంగా ఉంచడానికీ సరైన ధ్యానం అవసరం. ఎడతెగని పనిలో పెట్టడంవల్లా, నిరంతర పున రుక్తి వల్లా, చెడ్డగా వాడటం వల్లా, ఇంద్రియోల్లాసం వల్లా మనసుకు బడలిక, రాపిడి, వాశవం కలుగుతున్నాయి. సమస్త ఆలోచనల నుండి మనస్సుకు స్వేచ్ఛ నివ్వడం ధ్యానం. ఆలోచన ఆలోచనా పరుణ్ణి తయారు చేస్తుంది. ఆలోచనా, ఆలోచనా పరుడూ వేరు కాదు. అది ఏకోమ్ముఖ ప్రక్రియ. నిష్క్రియాత్మకంగా ప్రతిఆలో చనను గమనించడం వల్లా, అర్థం చేసికోవటం వల్లా ఆలోచన అంతం అవుతుంది.

ధ్యానంలో ఏకాగ్రత అనేది స్వార్థ పరంగా పైకివచ్చిన అంశం.

ఆత్మ, అహం, నేను అను సరిహద్దులలో జరిగే ప్రక్రియకు ప్రాధాన్యం ఇవ్వటమవుతోంది. ఆలోచనను కుదించే విధానమిది. కాని ధ్యానమంటే మనసు యొక్క (హృదియొక్క) గుణం. అంటే అమాయకత, స్వచ్ఛత కలిగి ఉండడం. ఇది ఒక ధ్యేయానికి మార్గంకాదు. సాధనవల్లా, అనుభవంవల్లా వచ్చే అమాయకత్వం కాదు. ఎందుకంటే ఆలోచన అమాయకమైంది కాదు.

"ధ్యానం వ్యక్తిగతమైంది కాదు, సామాజికమైందీ కాదు; రెంటినీ అధిగమిస్తుంది, రెంటినీ చేర్చుకుంటుంది. అదే ప్రేమ. ప్రేమ కుసుమ వికాసం ధ్యానం.

ధ్యానం అంటే ప్రార్ధనకాదు. ప్రార్ధనంటే దీనత్వం వల్లవచ్చే వేడికోలు. శబ్దం అంతమైతే ధ్యానం వుంటుంది. పదం లేక శబ్దం వల్ల మౌనమేర్పడదు. శబ్దమన్నా పదమన్నా మాటన్నా ఆలోచనే. వ్యక్తం నుండి విడివడటం ధ్యానమయితే, వ్యక్తం నుండి వ్యక్తానికి పోయేది ప్రార్ధన అవుతుంది.

ధ్యానం నిత్యనూతనం. గతం మీద ఆధారపడిందికాదు; గతం వర్తమానంలోకి రావటం కాదు. ఎప్పటి కప్పుడు వినూత్నమది. "ఈనాటి నా ధ్యానమొక మెళకువ; మంచితనపు సౌందర్యం. పుష్పించటమే ఆ మెళకువ."

"సర్వశక్తులను సమీకరించడం ధ్యానం. కొద్ది కొద్దిగా కూర్చు కోవడమో, ఇదిగాదిదిగాదనడమో, ఇదీ అదీ పట్టుకోవడమో ధ్యానం కాదు; వృధా చేసే శక్తుల యావత్తునూ మొత్తంగా కాదనడం."

లోనా తద్వారా బయటా, సమస్త ఘర్షణను తొలగించడం ధ్యానమవుతుంది. మానసికంగా చూచేవాడు చూడబడేది వేరు వేరుకాదు. కోపం వచ్చినపుడు కోపం వేరూ, నేను వేరూ కాదు. కోపమే నేను. ఆ విభాగం లేనపుడు కోపం అంత

మౌతుంది. ధ్యానంలో ప్ర...మనిక ఉంటుంది; అందులో ఏ ముద్ర పడదు. భౌతిక విషయాల విషయంలో తప్ప మానసికమైన ముద్రలు నిలువజేసికోనవసరం లేదు. తద్వారా గొప్పమౌనమే ర్పడుతుంది. రెండు ఆలోచనల మధ్య రెండు శబ్దాల మధ్య ఉండేది మౌనంకాదు. ఊహాతీతమైంది మౌనం. మౌనం వల్ల నూత్నసందృష్టి ఏర్పడుతుంది. కేంద్రముంటే పరిమితమైన ఖాళీ స్పేసు మాత్రమేఉంటుంది. కేంద్రం (నేను) లేకపోతే అనంత అవకాశం ఏర్పడుతుంది. అనంత అవకాశంలో స్పష్టతా, సద్దయా ఏర్పడతాయి. ఇది ధ్యానంలో ఒకభాగం. అభిప్రాయం యొక్క, జ్ఞానం యొక్క పనిగాక, మౌనం యొక్క ప్రక్రియ ధ్యానం.

"కృష్ణచేతనత్వమూ, భావాతీత ధ్యానమూ ఇలాంటివి అర్ధం లేనివి. అవి వ్యాపించిపోతున్నాయి. అలాంటి వాటిలో చిక్కుకు పోవటం జరుగుతుంది. ఇదొక ప్రదర్శన, వినోదం, కాలక్షేపం..... ఇలాంటివానిననుసరించి 'ఇది నూతన పంథా చివరంటా వెంటనంటి ఉంటాను' అంటారు".

ఒకరు చెపితే అయ్యేది ధ్యానంకాదు. ఎవరికి వారు అర్ధంచేసు కోవాలి. నీవు మనస్సును శాంత పరచలేవు. అలాంటి ప్రయత్నాలు ట్రిక్కులు మాత్రమే. నీవే మనసై ఉంటే 'నేను మనస్సును శాంతి పరుస్తాను' అని చెప్పజాలవు. గత స్మృతులతో నిండి ఉండే మనస్సూ, మేధాకణాలూ అవసరమొచ్చినపుడు క్రియలో ప్రవేశించడం, లేనపుడు సంపూర్తిగా శాంతించి ఉండటం ఎట్లా సాధ్యమో, ఆ విషయమంతా గ్రహించాలి.

ధ్యానం అంటే శక్తి విడుదల చేయడం. ధ్యానమనే శబ్దం యొక్క అర్ధం కొలవడం. మెడిటేట్ అంటే మెషర్ చేయడం. పశ్చిమ దేశాలు కొలతను పట్టుకొన్నాయి. కొలతంటే మాయ, భ్రమ, కాబట్టి కొలత లేని దాన్ని పట్టుకోవాలి అని ప్రాగ్దేశాల న్నాయి. కాబట్టి రెండూ సాంస్కృతికంగా, సామాజికంగా, బుద్ధి

ద్వారా, మతపరంగా వేరైపోయాయి.

"తన్ను గూర్చి తాను సమగ్రంగా తెలిసికొన్నపుడు, సంఘర్షణ పూర్తిగా తొలగుతుంది. అదే ధ్యానం. 'నేను' చూడడమూ, కేవలం చూడడమూ అని రెండు విధాలున్నాయి. మొదటిది భయంతో కూడింది. ఏదోచేయాలనీ, ఏదోపట్టుకోవాలనీ వెదుకులాడుతుంది. రెండోది పూర్తిగా వేరైంది. మీరుదేన్ని పట్టుకున్నారు?"

తెలివి తేటలకూ ఎరుకవహించుటకూ లోలోతులు చూచుటకూ ధ్యానమవసరం. దెబ్బకు దెబ్బ కొట్టకుండుటకూ, పలాయన వాదం ప్రవేశించ కుండుటకూ ధ్యానమవసరం. ధ్యానంచేయడం ఒక ఏర్పాటు వల్లగాక, సహజంగా జరగాలి, కోరిక వల్లగాదు. పద్ధతి పెట్టుకొంటే నిబద్ధమౌతుంది. ఆ నిబద్ధత మరింత బలపడుతుంది. చింతించడం పాంతంగా అంతం చేయడమే నిజంగా ధ్యానం. లేక పోతే విశ్వాసి, తన విశ్వాసాన్ని ధ్యానించడమే అవుతుంది.

కాబట్టి ధ్యానంలో ఊహకూ, ఆలోచనకూ తావులేదు. అవి బంధాలు. కాని ధ్యానం స్వేచ్ఛ నిస్తుంది. మంచితనం వేరు, సంతృప్తి వేరు. ఒకటి స్వేచ్ఛనిస్తే రెండోది కాలబద్ధమౌతుంది. గమనించే వాడూ, అనుభవించేవాడూ, ఆలోచించే వాడూ కాలమే. ఆలోచన కూడ కాలమే. కానిధ్యానం కాలం యొక్క పై క్రియ లకు మించింది, అధిగమించింది. సాధించడంలో ఆలోచన చేసే ప్రయాణపు దూరమే కాలం. ప్రయాణం కొత్తరంగు పులుముకున్నా, పాతదారి మీదనే. ఈ కాలాన్ని అధిగమించేది ధ్యానం.

* * *

# ఏకాగ్రత వేరు శ్రద్ధ వేరు

ఒక వస్తువుపై లేక విషయంపై మనసు కేంద్రీకరించడం ఏకాగ్రత. ఒక విషయంలో ఆసక్తి చూపడం శ్రద్ధ. ఏకాగ్రత వేరు, శ్రద్ధవేరు. ఏకాగ్రతలో ఇతర విషయాలూ, ఆలోచనలూ, స్మృతులూ నిరంతరం వస్తుంటాయి. వాటిని నిరోధిస్తుండాలి. ఇది శ్రమతో కూడింది. నిరోధించడంలో చాలా కృషి వృధా ఔతుంది. నిరోధిస్తూనే ధ్యేయవస్తువును తిరిగి తిరిగి మననం చేయడం జరుగుతుంది. యాంత్రిక విధానానికి మనసు అలవాటౌతుంది; ఆటోమేటిక్‌గా తయారవుతుంది. అవగాహనకు రాదు. అనుభూతి లేదు. కాబట్టి ప్రయోజనం శూన్యం. ఏకాగ్రత కాలపరిమితితో కూడిన యత్నం. ఆ పరిమితి కాలంలో గత విషయం లేక సమస్య వాయిదా పడుతుంది గాని తొలగిపోదు, పరిష్కారం కాదు. తాత్కాలిక శాంతియేగాని సర్వకాలిక సంపూర్ణ శాంతి లభించదు.

శ్రద్ధలో నిరోధంతో పనిలేదు. కావలసిన విషయంపై ఆసక్తి కనపడుతుంది. ఇష్టమైన విషయం పట్ల సకలేంద్రియాలు సునిశితంగా పనిచేస్తాయి. ఇది సహజప్రక్రియఔతుంది. శ్రమతో పనిలేదు. శ్రద్ధలో గమనిక, అవగాహన ముఖ్యం. నిగ్రహించట మంటే ఒక అభిప్రాయానికో సిద్ధాంతానికో బద్ధం చేయటం. దానివల్ల లోలోపల గందరగోళం ఏర్పడుతుంది. అదుపు ఘర్షణతో కూడింది. కాబట్టి శక్తిని వృధా చేయాల్సివస్తోంది. ఏకాగ్రత చూపడంలో ప్రయత్నం ఉంది. దానిలో ఒక హేతువు, ప్రలోభం, లాభం ఉంది. దాని వల్ల ఒక బిగువూ, బెట్టు, పట్టూ, పీకులాటా ఉన్నాయి. ఇవి పీడించేవి.

శ్రద్ధలో గమనికా, స్ఫూర్తీ, స్వేచ్ఛా ఉంటాయి. పీడనం, తాడనం ఉండవు. అడ్డు వచ్చేవీ, వ్యతిరేకించేవీ ఉండవు.

ఏకాగ్రత ద్వారా వాస్తవ విషయం లేక సత్యం తెలియదు.

ఏకాంతం అంటే ఒంటరి తనమా? కాదు (aloneness is not loneliness). అది అఖండత్వం.

మనిషి మనుష్యులకూ, సమాజానికీ, మామూలు జీవితానికీ దూరంగా ఉంటున్నపుడు తాను, ఏకాంతంగా ఉన్నట్లా లేక ఒంట రిగా ఉన్నట్లా అనేది గమనించుకోవాలి. స్వేచ్ఛగా, సహజంగా, సంతోషంగా, ప్రసన్నంగా, ప్రజ్ఞతో, ప్రేమతో, ఉండడం ఏకాంతం. భయం వల్లా, భద్రత నిమిత్తమూ, సౌఖ్యం కొరకూ, స్వార్థం కొరకూ, ఒడుదుడుకులు తట్టుకోలేక వాటిని దాచుకోవడానికీ ఏకాంతంగా ఉన్నట్లు నటిస్తూ దూరంగా ఉండడం ఒంటరితనం కాగలదు. ఒంటరితనంలో లోటూ, లేమీ వెన్నాడుతుంటాయి. మనసు బందీయై ఉండడంతో వికాసానికి తావులేదు.

అవగాహన ఏకాంతానికీ, విశ్వాసం ఒంటరి తనానికీ దారి తీస్తాయి. ఏకాంతంగా ఉన్నా ఏకాంతుడు అందరిలో తాను ఒకడను కుంటాడు. అందరిలో ఉన్నా ఒంటరి అందరిలాగా గాక తానువేరుగా, దూరమైనట్లుగా అనుకుంటాడు. ఏకాంతంగా ఉన్న వాడు సమగ్రాలోచన కలిగిఉంటాడు. ఒంటరిగా ఉన్నవాడు ఊసుపోక, విసుగ్గా ఉంటాడు. ఏకాంతం మైనపువత్తి అయితే, ఒంటరితనం ప్రేలుడు పదార్థం లాంటిది.

ఏకాంతమంటే అంతా ఒకటిలోనే, ALL IN ONE. ఒంటరితనం మనస్సు యొక్క స్థితి. సంబంధం లేకుండా తనచుట్టూ గూడుక ట్టుకొన్న పరిస్థితి. అది భయం కొల్పుతుంది. ఏకాకిగా ఉంటాడు. అసంపూర్ణంగా అసంతృప్తిగా ఉంటాడు. ఏకాకిగా ఉండటం భయం కరమైంది. భార్యాపిల్లలున్నా ఒంటరితనం ఏర్పడుతుంది. అయితే దాన్నుండి తప్పించుకోవటానికి ప్రయత్నించరాదు. దాన్ని గమనిస్తే అదే తొలిగిపోతుంది. అంతేగాని దాన్ని తొలగించుకోటానికి దేవుణ్ణే తెచ్చిపెట్టుకోవద్దు.

"చాలామంది ఏకాంతంగా ఉండలేక తోడుంచుకుంటారు.. ఏకాం తంగా ఉండాలంటే చాలా తెలివి కావాలి. సత్యం లేక

దేవుని కనుగొనటానికి ఏకాంతంగానే ఉండాలి. పెళ్లాం, బిడ్డలూ, మిత్రులూ ఉండుట మంచిదే! అయితే చుట్టున్న పరివారంలో తాను హరించిపోగూడదు.

"ఏకాంతం అవిభాజ్యం; ఒంటరి తనం వేరు చేస్తుంది. ఏకాంతం అణగి ఉంటుంది, సహిస్తుంది. కారణం లేనిదాన్నీ, కొలవరాని దాన్నీ ఏకాంతమే అవగాహన చేసికొంటుంది. క్రోధానికి సంబంధాలు తొలిగించి దూరం చేసే గుణముంది. అది ఏకాకిని చేస్తుంది. వినోదాలూ, తాగుళ్లూ ఒంటరితన్నాన్ని పోగొట్టలేవు. తాత్కాలిక ఉపశమనం ఇవ్వొచ్చు, కాని పూర్తిగ తొలగదు.

ధనం నుంచీ, బీద తనం నుంచీ జ్ఞానం నుంచీ, జయం నుంచీ, అభిప్రాయం నుంచీ, సుహృదం నుంచీ ఏకాకిగా దూరం కావడ మంటే మొద్దుబారి పోవడం. సునిశితత్వం లేకపోవడం అవుతుంది. ఒంటరితనమనే భయానికి తట్టుకోలేక పెళ్ళి చేసికోవడం ప్రేమగాదు. మర్యాద కొరకూ అనుకూలతకూ దాన్ని ప్రేమ అనవచ్చు. కాని వాస్తవానికి కాదు. మనం ఏకాంతంగాలేము. ఆలోచనలతో కట్టు బడి ఉన్నాము. మనం ఏకాంతంగా ఉండాలిగాని, ఒంటరితనంగా ఉండకూడదు. ఆలోచనవల్ల ఏకాంతంరాదు. ఆలోచన పూర్తిగా ఉడిగితే ఏకాంతం సాగుతుంది. ఏకాంతం నుండి ఏకాంతానికి సాగుతుంది. ఏకాంతంలో విజ్ఞానముంది.

ఒంటరి తనమనేది విచిత్రమే కాదు, భయంకరం అనిపిస్తుంది. దాన్ని సమీపించడానికిష్టపడము.

మౌనంగా ఉండడం వేరు. నిశ్శబ్దంగా ఉండడం వేరు: మొదటి దాంట్లో శ్రద్ధ వుంటుంది. రెండోదాంట్లో ప్రయత్నం, నిరోధం, బల వంతం ఉంటాయి. మొదటిది బయటికీ, లోనికీ శాంతిగా ఉంటే, రెండోది బయటికి శాంతిగా కనిపిస్తూ, లోన గందరగోళం సృష్టి స్తుంది. అవగాహనతో ఒకటుంటే ఆపద్దర్మంతో రెండోదుంటుంది. సహజమైంది ఒకటి, తెచ్చిపెట్టుకున్నది ఇంకొకటి.

# విశేష భాషితం

## జ్ఞానం - అవగాహన

'జ్ఞ' అనగా తెలిసికోవడం. జ్ఞానం అంటే తెలిసింది లేక తెలిసికోబడింది. తెలిసింది వ్యక్తం, తెలియంది అవ్యక్తం. అజ్ఞానం, అంటే తెలియంది; అంతేకాదు, అపోహగా కలిగిన జ్ఞానం. కేవలం తెలియకపోవడం అమాయకత.

తెలియడం అవసరం. తెలిసికోడానికి ఆసక్తికావాలి. అది సహజంగా వుండాలి. తెలిసికున్నాక అది జ్ఞాపకంగా మిగులుతుంది. గ్రహించిందంతా జ్ఞానమే. జ్ఞానం బ్రెయిన్ సెల్స్ ద్వారా సేకరింపబడుతూ వుంటుంది. అలాంటి జ్ఞాపకాల పుట్టే జ్ఞానం! గతమే జ్ఞానం. జ్ఞానం కలవారిని 'జ్ఞానులు' అంటున్నాం.

విషయ సంగ్రహణమే జ్ఞానం. వైజ్ఞానిక జ్ఞానం, సాంకేతిక జ్ఞానం ఒక స్థాయిలో అవసరమైనవి! అవే లేకపోతే భౌతిక జీవనాధారం లేదు.

విబద్ధించడంతో, పరిమితం చేయడంతో జ్ఞానం కలుగుతుంది. జ్ఞానం స్వేచ్ఛనివ్వదు. జ్ఞానం సృజనాత్మకమైన అంశంకాదు. అది సాగుతూ వుంటుంది. ఎప్పుడూ కొనసాగుతూ ఉంటుంది. అనగా జ్ఞానం పరిపూర్ణమూ, అచింత్యమూ, అవ్యక్తమూ అయినదాని దరికి చేరలేదు. అవ్యక్తమయిన దానికి జ్ఞానం అవరోధం.

జ్ఞానంతో ఉబ్బిపోయిన పండితులెట్లున్నారో చూస్తున్నారు గదా. నాకు నీకంటే ఎక్కువ అనుభవముంది, నాకు తెలుసు, నీకు తెలియదు అనే ధోరణిలో వుండే జ్ఞానవంతులైన తల్లిదండ్రుల్నీ ఉపాధ్యాయుల్నీ చూస్తున్నారు గదా! జ్ఞానం క్రమంగా గర్వాన్నీ, అహంకారాన్నీ 'నేను' అనుదాన్నీ పోషిస్తుంది. ఏమీ లేకుండా దేని

మీద ఆధారపడకుండా అహం వుండలేదు.

తాను 'ఫలాన' అని అనుకోవడానికీ, దుఃఖాన్ని పోషించ డానికీ విద్వాంసుడు జ్ఞానాన్ని వాడుకుంటాడు. అధ్యాపకులూ, తల్లిదండ్రులూ; గురువులూ యీలోకంలో ఏదేదో కావడానికీ, వాళ్ల ధ్యేయానికీ మార్గంగా, వాళ్ల కోర్కె నెరవేరడానికి సాధనంగా జ్ఞానాన్ని వాడుకుంటారు. జనం వాళ్ల వెంట పడుతుంటారు. అసలు వాళ్లకు నిజంగా తెలిసిందేమిటి? పుస్తకాల్లో వుండే దేమిటో వాళ్లకు తెలుసు. అనుభవించిన దేమిటో వాళ్లకు తెలుసు. ఆ అనుభవం వాళ్ల నిబద్ధతను బట్టి వుంటుంది. వాళ్ల లాగే మనలో చాలమందిమి శబ్దాలతో నిండిపోయి వున్నాం. సమాచారంతో నిండివున్నాం. దాన్నే జ్ఞానమంటున్నాం. అది లేకపోతే మనం లేము. కనుక యీ మాటల సమాచారం వెనుక ఎప్పుడూ భయం దాగివుంటుంది!

భయమున్నచోట ప్రేమ లేదు. ప్రేమ లేకపోతే జ్ఞానం మనల్ని నాశనంచేస్తుంది. ప్రస్తుతం లోకంలో అదే జరుగుతుంది. ప్రపంచ మానవులందరినీ పోషించడానికి మనకు కావలసిన ఆహారం ఉంది. మానవులందరికీ కూడు, గుడ్డ, గూడు కల్పించడం మనకు చేత నౌను. కాని మనమది చేయడంలేదు. ఎందుకంటే మనం సొంత అహంకారయుత కార్యకలాపాలతో జాతీయంగా గుంపులు గుంపులుగా విడిపోయాం. అందుకని ప్రేమలేని జ్ఞానం వినాశనానికి మార్గమవుతుంది. మనకిది అవగాహన కానంతవరకూ ఎన్ని పరీ క్షలు ప్యాసయినా, ఎన్ని సాధించినా, ఎన్ని ప్రతిజ్ఞలు, హోదాలు సంపాదించినా అవన్నీ అవినీతికీ, అణగిపోవడానికీ, మానవ హుందా తనాన్ని తగ్గించడానికీ దారి తీస్తాయి.

యుక్తవయస్సు వచ్చిన కొలదీ మనం సమస్యల్ని అర్థం చేసికో వాలి. ఎందుకంటే కేవలం పదవుల్నీ, బిరుదుల్నీ, గొప్ప జ్ఞానాన్నీ

చూసి మనం ఏ మనిషినీ గౌరవించరాదు. వాస్తవానికి మనకు తెలిసింది చాలతక్కువ. ఎన్ని పుస్తకాలైనా చదవొచ్చు. కాని చాలా మందికి ముఖాముఖిగా (నేరుగా) ఎలాంటి అనుభవమూ లేదు ప్రత్యక్ష సత్య దర్శనమూ, అనుభూతీ చాలముఖ్యం. దానికెంతో ప్రేమ అవసరం!

జ్ఞానం ద్వారా అవగాహన కలుగుతుందా? జ్ఞానం క్రియాశీలక అవగాహనాన్ని అడ్డగిస్తుందా? ఎన్నో విషయాలు సమకూర్చడం. సమాచారం సేకరించడం, పుస్తక భాండాగార మంత జ్ఞానం కలిగియుండటం మొదలగు వాటివల్ల మనం బంధ విముక్తులమౌతామనుకుంటాం. అట్లాకాదు. వైరం, ద్వేషం, యుద్ధం వినాశనాత్మకాలు, నిరుపయోగాలని తెలిసినా అవి ఆగడంలేదు. జ్ఞానం వాటిని ఆపగలిగేది కాదు. పైగా వాటిని ఉద్రేకపరచి ప్రోత్సహిస్తుంది. కాబట్టే మనమెందుకు సమాచార జ్ఞానం సంపాదిస్తున్నామో కనుక్కోవడం ముఖ్యం కాదా!

నిజంగా "వున్నదాన్ని" అభిప్రాయమూ, నమ్మకమూ చూడనీయవు. ఉన్నదాన్ని చూడడమే తెలివిలో భాగం. ముక్కల్ని, చెక్కల్ని అన్నీ తెచ్చి కలపడం తెలివి అనిపించుకోదు. స్పందించడమే సావధానత; అదే తెలివి. జ్ఞానంతోనూ, సమాచారంతోనూ తెలివికి పనిలేదు. ఆత్మా(నిజా)వగాహన వున్నప్పుడు జ్ఞానానికి తగినస్థానం వుంది. ఈ అవగాహన లేకపోతే జ్ఞానసాధన ఏదోపొందాలనో ఎక్కడికో పోవాలనో భావాన్ని కలుగజేస్తుంది. అది ప్రపంచంలో విజయంలాగ ఉద్వేగంగా, వుల్లాసంగా వుంటుంది. ప్రపంచంలో బాహ్య వస్తువుల్ని వదలివేయవచ్చు. కాని "ఆత్మ" జ్ఞానం పొందాలనే కుమ్ములాటలో ఫలాపేక్షభావం వుంటుంది. వేటగానికి తాను వెంటపడేదాన్ని ఎలానైనా పరేపట్టుకోవాలని వుంటుంది. ఇది ప్రాపంచికత పట్ల తృప్తిపొందినట్లవుతుంది. తన స్థితిలో 'ఉన్నదాని'యొక్క అవగాహన ద్వారా తన్నుతాను "నేను" అనేదాన్ని -

'అహం' అనేదాన్ని - అవగాహన చేసికోవడమే వుండదు. జ్ఞానంలో మనసు బరువెక్కివున్నంత వరకూ నిత్య దినచర్యలో వంచన చేసే ప్రతిఒక్క క్రియద్వారా తనను తాను అవగాహన చేసికోవడం సాధ్యంకాదు.

జీవితం ప్రవాహం లాంటిది. మారిపోతుంది. హరించిపోతుంది. ఎప్పుడూ ఆగదు. అలాంటి జీవితాన్ని జ్ఞాపకాల భారంలో పొందాలంటే మీకు చిక్కదు. అజ్ఞానంలో, అనుభవంలో జీవితాన్ని చూడాలంటే జ్ఞాపకాల బరువును పెంచడమే అవుతుంది. ఆ విధంగా జ్ఞానం, అనుభవం క్రమంగా జీవితాన్ని నాశనం చేసేవే అవుతాయి.

ఈర్ష్యే చూడండి. జ్ఞాపకం వల్లేకదా పాతుకు పోయింది? జ్ఞాపకాలరూపం జీవితంలో చాలా నాశనకరమైంది. అట్లే అనుభవం. నిత్యజీవిత విషయాలను మరచిపోనీ వాటినుండి తప్పించుకోమనీ అర్థంకాదు. అనుభవాలతో నిండినవాడు తెలివిగల మానవుడు కాదు. అనుభవంతో ముడి వేసుకున్న వాడు ప్రజ్ఞావంతుడు కాడు. పుస్తక జ్ఞానం సంపాదించిన విద్యార్థిలాంటివాడు. ప్రజ్ఞావంతుడు అమాయకంగా వుంటాడు. అతడు అనుభవ శూన్యుడు. అంతరంగాన సరళంగా వుంటాడు - బయటికి ప్రాపంచిక మైనవి అన్నీ ఉన్నా లేకపోయినా.

ఏ పేరు పెట్టినా సత్యమనేది ఎప్పుడూ నూతనంగా సజీవంగా వుండాలి. నూతనం, సజీవం అనేపదాలు ఆగిపోయినస్థితీ, చచ్చిన స్థితీ, మానవుని మనస్సులో స్థిరీకరింపబడ్డ అంశమూ కాదని తెల్పడానికే వాడబడ్డాయి. క్షణ క్షణం సత్యాన్ని క్రొత్తగా కనుగొనాలి. అది పునరుక్తం చేయదగ్గ అనుభవం కాదు. అది అలాగే కొనసాగేదీకాదు. కాలంలేని స్థితీకాదు. సత్యం వుండాలంటే ఒకదానికీ, అనేకానికీ మధ్య వుండే విభాగం సమసిపోవాలి. అది సాధించే స్థితి గాదు. మనస్సు లెక్కగట్టుకొని పరిణామం చెంది పెరిగేదీ కాదు. సత్యం పొందే వస్తువయితే జ్ఞానాభ్యాసం, సంచయకాంక్ష అవసరమవుతాయి.

అవగాహన సృజనాత్మకమైంది. అది స్మృతికాదు, జ్ఞాపకం కాదు. విముక్తి నిచ్చేది అవగాహన. నిల్వసరకు విముక్తి నివ్వదు.

అవగాహన సక్రమంగా వుంటే జ్ఞానాన్ని తగు స్థాయిలో వాడ గలవు.

విషయాలు సేకరించడం వల్ల జీవిత అవగాహన కలుగదు. జ్ఞానం వేరు, అవగాహన వేరు. జ్ఞానం అవగాహనకు దారి తీయదు. అయితే అవగాహన జ్ఞానాన్ని పెంచవచ్చు. జ్ఞానం అవగాహనకు అవరోధం కావచ్చు.

అబద్ధాన్ని అబద్ధంగా చూడడమే అవగాహనకు ఆరంభం.

స్వేచ్ఛ లేకుండా నిరాచ్ఛాదితమైన మనస్సు లేకుండా అవగాహన ఉండనేరదు. జ్ఞానంవల్ల అవగాహన రాదు.

ఇది ఆదర్శంకాదు. ఊహాత్మకంగా దూర తీరాలలో గానీ ఏదో ప్రదేశంలో గానీ సాధించేది కాదు. అవగాహన యిప్పుడే వుంటుంది, భవిష్యత్తులో కాదు. అవగాహనే క్రియ.

అవగాహన చేసికోవడమో, చేసికోక పోవడమో వుంటుంది. కాని సగం సగం వుండదు. అవగాహన అనేది సమగ్రమైన ప్రక్రియ. అది క్రియకు లేక ఆచరణకు వేరైందికాదు. అది కాలప్రభావం కాదు.

ఇక్కడ మునిగి ఎక్కడో తేలాలనుకుంటే అవగాహన యొక్క ప్రాముఖ్యత చూడలేవు. ద్వేషమూ, దాని ప్రతిఫలం అయిన దుఃఖమూ నీ అవగాహనలో వుంటే ద్వేషం నుండి తొలగడం ఎలా అని అడగవు. ద్వేషాన్ని అర్థం చేసికోవడం అనేది సమగ్రమైన క్రియ.

ఆలోచనకు స్మృతి కారణం. అవగాహనకు ఆలోచనతో పని లేదు. ఆలోచనా ప్రక్రియలో, 'నాకు అర్థం కాలేదు' అనే వరకు నీవు కారణాలు వెతకవచ్చు, తర్కించవచ్చు. అర్థమైతే మౌనం వహిస్తావు. అప్పుడు 'ఆ' నా కర్థమయింది అంటావు. ఆ అవగాహన ఆలోచనా ఫలితం కాదు.

నీకు నువ్వు అర్థం చేసికోకుండా పెద్దల వత్తిడికి లోబడ్డావు. కనుక నీమనస్సును నీవు అణిచి వేశావు. దాంతో భయమొచ్చి పడింది. ఆ భయం నీడలా నిన్ను వెంటాడుతోంది.

నన్ను నేను అర్థం చేసికోవడానికి ప్రయత్నిస్తే ఇతరులతో పోల్చుకోవడంగాని, ఇతరుల గూర్చి ఈర్ష్య చెందడం గాని వుండదు. మార్పుచేసికొని ఇతరుల్లాగా తయారు కావాలి అని అనుకొన్నప్పుడు ఈర్ష్య ప్రవేశిస్తుంది.

(ప్రత్యేకవ్యాసం - శ్రీకాళహస్తి - 1987)

సారాంశం:

జీవించడం అనేది క్షణ క్షణం జరిగే ప్రక్రియ. అలా జరుగుతున్నదే జీవితం. అది వాస్తవమైంది. ఎప్పటికప్పుడు తాజాగా జరుగుచున్నదాంట్లోనే అనుభూతీ, ఆత్మీయతా, ఉత్తేజమూ, చైతన్యమూ ఉంటాయి.

విషయం వాస్తవంగా తెలిసికోవడమే అనుభూతి. అది తాజాతనము. అనుభూతి చెందినతోడనే ఆ ప్రక్రియ అనుభవమై గతంలో కలిసిపోతుంది. స్మృతిరూపంలో మిగిలిందే జ్ఞానం. పాతదిపోయి మరొకటి తెలియడమో, మరో అనుభూతి చెందడమో, ఉండవలసిన సంబంధంలో ఉండడమో ఇక జీవించడం అవుతుంది. గతించిన అనుభవం గానీ, దానిమండి కలిగిన జ్ఞానం గానీ, ఇప్పుడు జీవించడం కాదు. గతించింది మళ్లీ తాజాగా జీవించడానికి, అవరోధం

అవుతుంది, భారం అవుతుంది. ఒక విషయం అనుభూతికి రాక, బుద్ధిపరంగా తెలిసికోవడం జరిగిందనుకో, అప్పుడది విషయ సేక రణగా వుంటుంది. అదీ జ్ఞానమే కాబట్టి, జ్ఞానమంటే గతానుభవ ఫలమూ కావచ్చు, విషయసేకరణా కావచ్చు. అలా చూసినపుడు జ్ఞానం వర్తమాన జీవితానికీ, సమస్యలకూ నిరుపయోగమన్నారు.

అవగాహన ప్రక్రియ ఫలితం అనుభూతి. తెలిసికొనే ప్రక్రియ పర్యవసానం అవగాహన. ఆ ప్రక్రియకు తెలివి సాయపడుతుంది. తెలివి పరిశీలన వల్ల పుడుతుంది. అది నెమ్మది మనసుకూ, ప్రేమకూ సంబంధించింది. అవగాహన వల్ల అవశేషముండదు, వాస్తవికత వుంటుంది. సహజమైన చర్యవుంటుంది.

* * *

# బంధ విముక్తి

ఈర్ష్య వుంటే ప్రేమ వుండదు. ఇది తెలుసు. బంధం వున్న పుడు ప్రేమ కలగదని కూడ గ్రహించాను. కనుక ఈర్ష్యా, బంధమూ లేకుండ స్వతంత్రంగా వుండడం నాకు సాధ్యమా?

నేను ప్రేమించడం లేదని నాకు తెలుసు. ఇది వాస్తవం. నిజంగా ప్రేమ అంటే ఏమిటో నాకు తెలియదు. నేను నా భార్యను ప్రేమిస్తున్నట్లు నటించాలని లేదు. ఆమె బంధంలో పడ్డా నని మాత్రం తెలుసు. బంధంలో భయమూ, ఈర్ష్యా, ఆదుర్దా, ఆధారపడడమూ వున్నాయని తెలుసు. ఒకరిపై ఆధారపడడం నా కిష్టంలేదు. ఒంటరిగా వుండడం వల్ల ఆధార పడవలసి వస్తోంది. ఆఫీసులోనో, ఫ్యాక్టరీలోనో అలసి పోతాను. ఇంటికి వచ్చి నానుండి నేను తప్పించు కోవాలని చూస్తాను. అపుడు తోడూ, నీడా, వూరటా కావాల్సి వచ్చాయి. దాంతో బంధం పడుతుంది. దీని నుండి తొలగడమెలా అని ప్రశ్నించుకుంటున్నాను. భార్య బంధం ఒక ఉదాహరణ మాత్రమే.

నా అన్వేషణలో ఒక గురువును ఆశ్రయించాను, ఒక పద్ధతి లభించింది. దాంట్లో ఇరుక్కు పోయాను. అతడు 'నేను నీకు సాయపడతాను అది చెయ్యి, ఇది చెయ్యి' అని అభ్యాసంలోకి దించుతాడు. స్వేచ్ఛ కోరి, అతడు చెప్పింది చేస్తాను. ప్రయోజన ముంటుందని అతడు వాగ్దానం చేస్తాడు. నేను ఆ ప్రతి ఫలాన్ని ఆశిస్తున్నాను. ఇది బుద్ధిహీనత అనిపిస్తుంది. స్వేచ్ఛగా వుండాలనే కోరికతో వేరే ప్రతిఫలాపేక్షలో తగులుకుంటున్నాను.

బంధంలో పడాలని లేకపోయినా ఏ పుస్తకమో, పద్ధతో, ఏదోబ హుమానమో చూపగానే అందులో చిక్కుకుపోతున్నాను. స్త్రీగానీ, పద్ధతిగానీ, అభిప్రాయం గానీ - ఏదైనా బంధమే.

'బంధ విముక్తుణ్ణి కావడానికి ఏమి చేయాలి'? అని అడుగుతున్నాను. అందులోనే ఒక ఉద్దేశం వుంది. అంటే బంధమూ, భయమూ లేని స్థితి సాధించాలనే కాంక్ష వుంది. ఇది మరో బంధం. స్త్రీ, పద్ధతి, అభిప్రాయంతోపాటు వుద్దేశం కూడా బంధం అయింది. బంధ విముక్తిలో ఇంత గొడవ వుందని తెలియదు. వీటన్నిటిలో ఎందుకు కూరుకు పోయాను?

బంధానికి కారణం ఒంటరితనం. ఒంటరిని ఎందుకయ్యాను? ఒంటరితనం సహజమైందా? వంశానుగతమైందా? దినచర్యఫలితమా? సహజమో, వంశానుగతమో అయితే తప్పదు. అలా కాదని ప్రశ్నిస్తున్నాను. యుక్తితో కూడిన సమాధానం వాంఛించడం లేదు. ఒంటరితనం ద్వారానే నాకు సమాధానం చిక్కాలి. అందుకు ఎదురు చూస్తున్నాను. నిఘావేస్తున్నాను. పారిపోయినా, భయపడినా, ఆలోచన అడ్డుకున్నా అది బయట పడదు. నా శక్తి అంతా దాన్ని గమనించడంలోనే వుంది. సవాల్ చేశాను గనుక అది సమాధానం చెప్పాలి. అది చిక్కులో పడగానే గొప్ప శక్తి విడుదల అవుతుంది. దాన్ని ఆలోచన అడ్డుకోదు.

ఒంటరి తనాన్ని మెదడు కలగజేసిందా? లేక నిత్యజీవితపు టాలోచన మూలాన వచ్చిందా? అత్యున్నతోద్యోగి కావాలనే కాంక్షతో ఆఫీసులో వేరైపోతున్నాను. ఆలోచన ఎప్పుడూ అందరిని అధిగమించాలని ప్రేరేపిస్తూ వుంటుంది. ఎడబాటు ధోరణిలో మనసు పనిచేస్తుంటుంది.

చదువు ఒంటరితనాన్ని తెచ్చి పెడుతుంది. వృత్తిపరమైన జీవితాన్ని, ప్రత్యేకతనూ కూరుస్తూ వేరుచేస్తుంది. వేరుకావడం ఆలోచన ద్వారా జరుగుతుంది. ఆలోచన విభజనాత్మకమూ, పరిమితమూ, కాలబద్ధమూ కావడం వల్ల ఒంటరితనాన్ని సృష్టిస్తుంది. ఆ పరిమితిలోనే నేను పలానా...... అనుకుంటూ భద్రత పొందాలని చూస్తుంది.

తాను పరిమితమని ఆలోచన గ్రహించ గలదా? దాని స్థితి దానికి తెలిస్తే ఘర్షణ వుండదు. ఆ మాట నేనంటే, నేనేదో వేరైన వాడినవుతాను. అందుచే ఘర్షణ, హింస తప్ప, ప్రేమ వుండదు. మరోవిధంగా చెప్పాలంటే అంతరంగమూ, అందరి చైతన్యమూ వొకటేనా? అంతరంగమే చైతన్యమనీ, చైతన్యం వల్లనే అంతరంగం తయారవుతుందనీ అంతరంగానికి తెలియడం వేరు, ఎవరో చెపితే వినడం వేరు. రెండవది ఆలోచన సృష్టించింది. 'నేను' అనేది తెచ్చిపెట్టింది. ఆలోచన మీద నేను దేనినైనా తెచ్చిపెడితే అది ఎదురు తిరుగుతుంది. ఘర్షణ వచ్చి తీరుతుంది.

ఆలోచన తన పరిమితిని గ్రహించిందా లేక అది అసాధారణమూ, ఉన్నతమూ, దివ్యమూ అయినట్లు నటిస్తుందా? ఆలోచన ఎప్పుడూ జ్ఞాపకం మీద ఆధార పడిందే. ఇది స్పష్టంగా, సహజంగా, సరళంగా దానికి తెలియాలి. అది దైవారాధన చేసినా, అద్భుతాలయాలు సృష్టించినా పరిమితమే, అత్యల్పమే, తళుకు బెళుకు మాత్రమే. అది తెలియడానికి బయటి నుండి ప్రభావితం కానక్కర లేదు.

స్వయం సంభాషణ ద్వారా నే తెలిసికొన్నదేమంటే ఆలోచనయే వొంటరి తనాన్ని సృష్టించింది. అది ఒంటరి తనపు సమస్యను పరిష్కరించలేదు. నిజంగా అది పరిమితం, విచ్ఛిన్నకరం, విభజనాత్మకం అని తెలిసినపుడు ఒంటరితనమే లేదు. కనుక బంధం నుండి విముక్తి పొందింది. బంధాన్నీ దానికి సంబంధించిన గుణాలనూ విశ్లేషణ చేయకుండా పరిశీలిస్తూ, చూస్తూ, నిఘావేసి గుర్తిస్తూ, గమనిస్తూ వుండడంతో, ఇదంతా ఆలోచనే చేసిందని తెలియడంతో బంధం తెగిపోయింది. ఇందులో సాధనాలేదు, కృషీలేదు. అవి వుంటే ఘర్షణ మళ్లీ ప్రవేశిస్తుంది.

ప్రేమలో మమత్వం (బంధం) లేదు; ఉంటే ప్రేమకాదు. లేని

దానివి లేదనుకోవడమే బంధం తొలగడం. అంటే నా భార్యా, నా మిత్రురాలూ, నా ప్రక్క వారూ నాకు హానిచేసిన సంగతే గుర్తు లేదు. ఆలోచనా గమనం నాభార్యను గూర్చి సృజించిన ప్రతీకగానీ, చిత్తరువుగానీ, లైంగికానందాలుగానీ స్మృతిలో లేవు. ఈ విధంగా భయం, విలాసం, సుఖేచ్ఛ మున్నగు వాటిని గూర్చి వేరు వేరుగా పరిశోధించనక్కర లేదు. ఒకే చూపుతో అన్నీ స్వాధీనమైనాయి.

కనుక ప్రేమ కాని దాన్ని తొలగించడం ద్వారా ప్రేమ కలిగింది. ప్రేమవెంట పడనవసరం లేదు. వెంటపడితే ప్రేమ కాదు. బహుమతి అవుతుంది. కానిదైన ప్రతిదాన్నీ విచారణతో మెల్లిగా, మెలిదివ్వకుండా, భ్రమలేకుండా, జాగ్రత్తగా అంతం చేయడంతో ఆ వేరైన దాని వునికేర్పడింది.

ఇది 1977 ఆగష్టు 30 వ జిడ్డు కృష్ణమూర్తి బ్రాక్‌వుడ్ పార్క్ సమావేశంలో తనతోతాను సంభాషించినట్లుగా చేసిన చర్చ యొక్క సారాంశం.

సంక్షిప్తంగా: బంధంగానీ ఈర్ష్యగానీ ఆలోచన వల్ల ఏర్పడింది. బంధం నుండి బయట పడాలని ఏ గురువునో ఆశ్రయిస్తారు; వేరే ప్రతిఫలానికి ఆశపడతారు. అది మరోబంధం అవుతోంది. అంచేత గురువువల్లా, సాధనవల్లా, గ్రంథంవల్లా, బంధవిముక్తి కలగదు. తనను తాను తెలిసికోవడం ద్వారా, తన ఆలోచనా చలనాన్నీ, పరిమితినీ దర్శించడం ద్వారా బంధభావం తొలుగుతుంది. విరుద్ధమైనవీ, విభిన్నమైనవీ పోగానే ప్రేమ నిలుస్తుంది. ప్రేమ అసాధారణమైంది.

(జన్మదిన ప్రత్యేక వ్యాసంలో ఒకభాగం. శ్రీకాళహస్తి - 1987)

* * *

# జీవన తత్వం

కృష్ణమూర్తి క్రొత్తగా చెప్పేదేముంది? అది పూర్వం శాస్త్రాల్లో లేకపోతే కదా, కాకపోతే గురువక్కర్లేదన్నాడు. గ్రంధాల మీద ఆధారపడొద్దన్నాడు. కులం, మతం, జాతీయతలు, సంకుచితాలన్నాడు. ఇందులో పెద్ద తత్వం ఏముంది? అని పదే పదే ప్రశ్నిస్తారు.

కృష్ణజీకి తన తత్వం అంటూ ఏమైనా వుందా? ఆయనకు ఏలాంటి సిద్ధాంతాలూ సూత్రాలూ, నిబంధనావళీ, నమ్మకాలూ, నిర్ణయాలూ లేవు. శిష్యులంతకంటే లేరు. అవన్నీ వుంటే, మరో సాంప్రదాయక జగద్గురువయ్యేవాడు. అవకాశాలున్నా, అతడలా తల్చుకోలేదు.

కృష్ణజీకి ముఖ్యమైంది అవగాహన, వర్తమాన అవగాహన, క్రియాశీలక అవగాహన, తక్షణ చర్యాత్మక అవగాహన, నూతనత్వాన్నిచ్చే అవగాహన, ఉత్తేజాన్ని కల్గించే అవగాహన. పరిశీలన, జాగృతి అవగాహనకు ఊతకర్రలు. అవగాహన అంటేనే ఆచరణాత్మకమైంది. ఆలోచన, ఆచరణ అంటూ రెండు వేరువేరుగా లేవు. ఆలోచనకూ ఆచరణకూ మధ్య సాధనా కాలం అతని దృష్టిలో లేదు. అందుకే కృష్ణజీ ధోరణిలో భ్రమ, మోసం, ఆశ, ధ్యేయం, ఆదర్శం అంటూ లేవు. వంచనకు తావు లేనిదే మంచితనం.

కృష్ణజీ తనకు తాను చేసికొన్న అవగాహనలో ఇతరులతో పోటీ పడలేదు. తనను ఎవరితోనూ పోల్చుకోలేదు. పోటీలోనూ, పోలికలోనూ, ఆశ, నిరాశ, ఈర్ష్య, ఘర్షణ, మనసును కలవరపెడుతుంటాయి. వాటివల్ల ఆదర్శమే ధ్యేయమై, వాస్తవం దూరమవుతుంది. కాబట్టి ఏ తత్వాన్నీ, ఏ వ్యక్తినీ అనుసరించకుండా అతడు సర్వస్వతంత్రమైన విశ్వదార్శనికు డయ్యాడు.

కృష్ణజీ దర్శించిన సత్యం ఏమిటి? పాటించిన తత్వం ఏమిటి?

ఎలాదర్శించాడు? జీవిత అవగాహన ద్వారానే విప్లవాంటి వాస్తవాలను అతడు గుర్తించాడు.

రెండు ఉదాహరణలు చెప్పుకుందాం

మొదటి ఉదాహరణ:

కృష్ణజీకి నిత్యానంద అనే తమ్ముడు ఉండేవాడు. బుద్ధికుశలత, వ్యావహారిక జ్ఞానం అతనికి బాగా ఉండేది. నిత్యమూ కృష్ణ, నిత్యానందపైన ఆధారపడేవాడు. అన్నదమ్ములిద్దరూ ప్రత్యేక పరిస్థితుల్లో పన్నెండేండ్లు ఐరోపాలో ఉన్నారు. విద్యార్జన చేశారు. పేరు ప్రఖ్యాతులు గడించారు. అదే సమయంలో కృష్ణ కన్నతండ్రియైన నారాయణయ్యకూ, పెంపుడు తల్లియైన అనిబెసెంటుకూ మధ్య కృష్ణ విషయమై వ్యాజ్యం నడిచింది. చివరికి కృష్ణ అనిబెసెంట్ పక్షం వహించాడు. ఆమెకే దక్కాడు. ఆ తర్వాత అన్నదమ్ములిద్దరూ ఇండియాకు వచ్చినపుడు తండ్రిని చూడాలనుకున్నారు. తండ్రి మద్రాస్ - ట్రిప్లికేన్‌లో ఉండేవారు. ఇద్దరూ అక్కడికి వెళ్లారు. కృష్ణ, తండ్రి పాదాలకు నమస్కరించాడు. తండ్రి వెంటనే వెనక్కి జరిగి, కాళ్లు కడుక్కుని వచ్చాడు. పిల్లలు ఆంగ్లేయులతో ఉండడం వల్ల, కుల భ్రష్టులయ్యారని, తండ్రి భావించాడు. భోంచెయ్యమని కూడ అడగలేదు. “మా అమ్మ ఉన్నట్లయితే కనీసం అన్నమయినా పెట్టి పంపించేది కదా” అని బాధ పడ్డాడు. దాంతో కృష్ణమూర్తి హృదయంలో సంచలనం రేకెత్తింది. తిరుగుబాటు లేచింది. మనిషిని గౌరవించని సంస్కృతి మలినమైందని అతడు అనుకున్నాడు. మనుషులను విభజించే మతం, కులం పాటించడం మహాపరాధమని గ్రహించాడు. కులాన్నీ, మతాన్నీ, జాతీయతనూ కూడ జీవితంలో జొరపడనీయ లేదు. ఇదే అతని జీవనతత్త్వం.

అంతేకాదు. “సంస్కృతీ, సంప్రదాయమూ, గతానికి సంబంధించినవి. జ్ఞానం గతానికి సంబంధించింది. కాబట్టి పూర్వీకులకూ, పుస్తకాలకూ సంబంధించింది ఏదైనా ఎవరినీ ఉద్ధరించదు. జ్ఞాన

మంటే విషయ సేకరణ. నేర్చుకోవడమంటే తక్షణ గ్రహింపు. ఆలోచన అంతమైనపుడే అవగాహన కల్గుతుంది. సంప్రదాయబద్ధునికి మర్యాద, మన్ననలు లభించవచ్చు. కాని అవగాహన ఏర్పడదు. అలాంటివారికి ప్రేమించడం తెలియదు. పుస్తకాలు, మతాలు, గురువులు, పాండిత్యం - వీటిద్వారా సమస్యలు తీరవు.

"సాంప్రదాయకంగా ఆలోచించే మనసు కొత్తదాన్ని తెలిసికోలేదు. కొత్తది పాతదానిలో చేరిపోతుంటే, కొత్త వెలుగు రాదు. పాతది పోతే కాని కొత్తది నిలవదు. గతాన్ని నెమరు వేసికోవడం గందరగోళానికి దారితీస్తుంది. ఇతరుల జీవితానుభవాలు, మరొకరికి సత్యాన్ని చూపవు. సత్యానికి నిర్దుష్టమార్గాలు లేవు" అని చెప్పాడు. విభేదాలు గూర్చి మాట్లాడుతూ కృష్ణమూర్తి ఇలా అంటాడు: "కుల మత జాతి వర్గ విభేదాలతో ఒకరి నుండి ఒకరిని విడదీయుట హానికరం. దైవం బుద్ధి జనితం - మంత్ర తంత్ర పూజా ధ్యానాదులు సత్యాన్ని చూపించలేవు. మత విశ్వాసం ద్వారా సత్యదర్శనం కలగదు."

రెండవ ఉదాహరణ:

ఇంగ్లాండులో లా చదువుతుండగా నిత్యానందకు క్షయవ్యాధి సోకింది. కృష్ణ పారిస్‌లో ఉన్నాడప్పుడు. నిత్యను పారిస్ రప్పించి చికిత్స చేయించాడు. వ్యాధి తగ్గుముఖం పట్టింది. తొమ్మిదేండ్ల వయసులో కృష్ణను కనుగొని, విశ్వప్రవక్త అవుతాడని చెప్పిన లెడ్ బీటర్ అప్పుడు ఆస్ట్రేలియాలో, సిడ్నీలో దివ్యజ్ఞాన సమాజ వార్షికోత్సవాలు నిర్వహిస్తున్నాడు. అనిబెసెంట్ ఆదేశాన్ననుసరించి అన్నదమ్ములిద్దరూ సిడ్నీ వెళ్లారు. అక్కడ నిత్యకు మళ్లీ పరీక్షలు జరిపారు. ఊపిరితిత్తులు రెండూ దెబ్బతిన్నాయని తెలిసింది. వెంటనే స్విడ్జర్లాండు పంపమని డాక్టరు సలహా యిచ్చాడు. స్విడ్జర్లాండుకు ప్రయాణమైన అన్నదమ్ములు ఒక మిత్రుని సలహా ప్రకారం కాలిఫోర్నియాలో, ఓహై గ్రామంలో ఆగిపోయారు. అక్కడ నిత్యానందకు

చికిత్స జరిగింది. అది 1923వ సంవత్సరం. అక్కడే కృష్ణకు ఒక విధమైన అనుభూతులూ, దైహిక బాధలూ, అంతరంగ పరివర్తనా మొదలైనాయి.

కొంతకాలానికి అడయార్‌లో జరుగనున్న స్వర్ణోత్సవ మహాసదస్సుకు హాజరుకమ్మని అతనికి అనిబెసెంట్ వర్తమానం పంపింది. నిత్యానందకు ప్రాణాపాయం ఉండదని పరమగురువులు హామీ ఇచ్చినట్లు అభిప్రాయం కల్గించారు. అమ్మమాట విశ్వసించి, గురువులపై భారం వేసి, నిత్యానంద సేవకు వేరేవారిని ఏర్పాటుచేసి, కృష్ణమూర్తి బయలు దేరాడు. నౌకాయానంలో రోం నగరం దాటగానే నిత్యానంద మరణించినట్లు తంతి వచ్చింది. అది విన్న కృష్ణమూర్తి ఖిన్నుడైపోయాడు. గురువులపై విశ్వాసం చెదిరిపోయింది. అమితమైన ఆవేదనకు గురిఅయ్యాడు. అయితే పది దినాల తర్వాత ద్విగుణీకృత శక్తితో పుంజుకున్నాడు. అప్పటినుండి ఎలాంటి గురువులనూ నమ్మడం మానివేశాడు. దేనినీ విశ్వసించనక్కర లేదు అన్నాడు. వాస్తవంతో వ్యవహరించకలిగి నపుడు విశ్వాసంతో పనిలేదన్నాడు. "ఉదయిస్తున్న సూర్యుణ్ణి చూడడానికి విశ్వాసం కావాలా?" అని అడిగాడు. విశ్వాసం చాల ప్రమాదకరమైంది. నేను మీ జీవితాలకు అద్దం లాంటి వాడను. నా అద్దంలో మీ జీవితాలను చూచుకొని, దాన్ని విసరి వేయవచ్చు అని అన్నాడు. అది కృష్ణజీ జీవన తత్త్వం.

**నిజావగాహన:**

ఆలోచనా కాలుష్యం లేకుండ జీవించడమనేది కృష్ణజీలో వచ్చిన గొప్ప విప్లవం. పుట్టగానే బిడ్డ కెవ్వు మంటుంది. అది ఆలోచనతో చేసే పనా? కాదు. దేహానికి ఒక విధమైన తెలివివుంది. అది తనంతకు తాను నిర్వహించుకోగలదు. కాని ఆలోచన మనిషిలో ప్రవేశించగానే సమస్యలు ఉత్పన్నమౌతాయి.

మనిషి మనుగడకు ఉపయోగపడే ప్రధానమైన పనిముట్టు

మెదడు. అది ఆలోచనకు మూలం. భౌతిక అవసరాలు తీర డానికి అది బాగా పనిచేయాలి. కళ, సైన్సు వృద్ధి చెందడానికి మెదడుకు శిక్షణ ఇవ్వాలి. దానిని ఒక మూసలో పెట్టాలి. అందుకు తగినట్లు మెదడు కణాలు మార్పిడి చెందుతాయి. ఆ విధంగా నిబద్ధించ బడుతుంది; కండిషనింగ్ అవుతుంది.

భౌతిక విషయాలలో మెదడు నిబద్ధతకు గురికావచ్చు. కాని మానసిక విషయాలలో నిబద్ధితమైతే చిక్కులు వస్తాయి. అంటే వస్తువును గూర్చి కాక, వస్తు సంబంధమైన విషయంతో చింతన మొదలవుతుంది. అలాంటి విషయ జ్ఞానం నుండే ఆలోచన పుట్టు కొస్తుంది. ఆలోచన వాస్తవమూ కాదు, స్వతంత్రమైందీ కాదు. అది జ్ఞానంపై, అనుభవంపై, గతంపై, కాలంపై, ఆధారపడి వుంటుంది. అది ఊహాత్మకమైంది. కనుక పరస్పర విరుద్ధ అభి ప్రాయం కలిగి వుంటుంది. పరిమితికి లోనై వుంటుంది. అంచేత అందులో ఘర్షణ వుంటుంది.

అవాస్తవికంగా నిబద్ధమైన మెదడు, యాంత్రికమై మొద్దుబారి పోతుంది. ఆ మేరకు మూసుకుపోయి చైతన్యవంతమైన మనసుతో సంబంధం పెట్టుకోలేక పోతుంది. ఆలోచన ఎంత పెరిగితే అంత బంధమౌతుంది. ఆ బంధమే "అహం". ఆలోచన, అహం, పర స్పర పోషకాలై మనిషికి విషవలయం సృష్టిస్తాయి.

మనసు మెదడుకు వెలుపల వుంటుంది. మాటలతో మనసును కొలువ లేము. నిబద్ధమైన మెదడు చేసే పనిని కొలవవచ్చు. ఆ కొలతే కాలం. నిబద్ధంకాని మెదడుతో మనసు సంబంధం పెట్టుకో గలదు. అపుడు మెదడు మనసుయొక్క హెచ్చరికలు గ్రహిస్తుంది. వాటి మధ్య కమ్యూనికేషన్ అనగా భావప్రసారం వుంటుంది. నిబ ద్ధత లేదు కనుక స్వేచ్ఛ వుంటుంది. స్వేచ్ఛ వల్ల అంతర్దృష్టి ఏర్పడుతుంది. తద్వారా అత్యున్నత తెలివి ఉద్భవిస్తుంది.

"నేను" అనేది జ్ఞాపకాల పుట్ట. దాని పేరే ఆత్మ. జ్ఞాపకాలు శవాలతో సమానం. ఆ పుట్టలోకి అంతర్దృష్టి ప్రవేశిస్తే "అహం" పటాపంచ లవుతుంది. ఇక ఏ జ్ఞాపకమూ వుండదు. వర్తమా నమే వుంటుంది. ఏదో కావాలని అనుకోవడమంటే జ్ఞాపకాలు ప్రోగు చేసికోవడం. జ్ఞాపకాలు లేనప్పుడే కరుణ వుంటుంది, తెలివి ఉంటుంది.

"ఆలోచన వేరు, ఆలోచనాపరుడు వేరని మనసు విభేదం కల్పిస్తుంది. ఆలోచనలు వస్తూ పోతూ వుంటాయీ, 'నేను' అనేది శాశ్వతమయిందీ, అని అనుకుంటాం. ఆలోచన తొలిగిస్తే ఆలోచనాపరుడేడి? శాశ్వతత్వం పోందాలనే ఆకాంక్షతో మనసే 'నేను' అనేదాన్ని ఆలోచన నుండి వేరు చేస్తుంది. అయితే తెలిసినదాన్నుండి తెలియని దానికి ఆలోచన సాగలేదు. అంచేత తెలిసిన దాని నుండి విముక్తి పొందడమే మనసు చేయగల పని.

వాస్తవంలో చెడు వున్నపుడు. దానికి ఆలోచన అనే ఆజ్యం పోయరాదు. మౌనం వహించాలి. మౌనమంటే మాటలకు మరో రూపం కాదు. మాటలు లేకుండా మాటల ఆనందం మౌనం ద్వారా పొందాలనేది కూడ ఒక ఆలోచన. అందుకే శాశ్వతం, అశాశ్వతం, ఉన్నతం, అధమం, అనే విభేదాలు సృష్టిస్తుంది ఆలో చన. ఆలోచన అనవసరమైనట్టి అనేక గుర్తింపులు చేస్తుంది. వాస్త వానికి రంగులు పులుముతుంది. ముసుగులు తొడుగుతుంది. కుల మత జాతి హెచ్చు తగ్గు విభేదాలతో మనుషులను విడదీస్తుంది. అది మనసులో ఖాళీని కూడ సృష్టిస్తుంది. ఆ ఖాళీలో 'నేను' ఉంటుంది. అది అహానికి కేంద్రం. నేను అనే కేంద్రం పోయిన పుడే మనసులో విశాలత, ప్రశాంతత కలిసి వుంటాయి. ధ్యేయం లేని లోతైన ధ్యాన స్థితిలో ఆలోచనా వుండదు, అహమూ వుండదు.

కాబట్టి, ఆకాశంలాంటి మనసుకు మబ్బు, జబ్బు పట్టకుండా ఉండాలంటే ఆలోచనా కాలుష్యం ఉండకూడదు.

కృష్ణజీతత్వం జీవితాలకు సంబంధించిందేకాని, దేవతలకు సంబంధించింది కాదు. "నేను సమాజమును విడిచి వుండలేదు. సమాజం నుండియే ఆనందం, ప్రకాశం పొందాను" అని చెప్పుకున్నాడు. వ్యక్తిద్వారా సమాజంలో మార్పు రావాలని కోరాడు. ప్రాంతీయ తత్వం కలవాడు వ్యక్తి. విశ్వ వ్యాపకత్వం కలవాడు మానవుడు. అతని హృదయం మానవత్వం. అతని జీవితం వసుధైక కుంటుంబం.

వ్యక్తులు కలిస్తే సంఘం. వ్యక్తియే సమిష్టి. సమిష్టి వ్యక్తికాదు. జీవునికి వ్యక్తిత్వం, అస్తిత్వం ఉన్నాయి. సంఘానికి లేవు. వ్యక్తితో వ్యవహరించవచ్చు. సంఘంతో అంతగా కుదరదు. కాబట్టి వ్యక్తి మారితేగాని సమాజం మారదు. మారే స్వేచ్ఛ, శక్తీ వ్యక్తికి వున్నాయి. సమాజం వ్యక్తిని లోబరచు కోవాలని చూస్తుంది. అయితే వ్యక్తి దాన్నుండి విముక్తి చెందవచ్చు.

కృష్ణజీ ఏమన్నాడంటే "వ్యక్తి వున్నది సంబంధంలోనే. సంబంధం లేకపోతే వ్యక్తిలేడు. ఈ సంబంధం సరిగ్గా అవగాహన కాకనే ఘర్షణా, గందరగోళమూ ఏర్పడుతున్నాయి. ఒక విధమైన నీతి మీదా, హింస మీదా సమాజం ఆధారపడింది. దానికి మనం అల వాటు పడ్డాం. తెలిసో తెలియకో చిన్నప్పటినుంచీ మనం హింసతో, అనుకరణతో తయారయ్యాం. స్థిరమైన అభిప్రాయాల మూసలో పెరిగాం. దానినుండి బయట పడడం మనకు తెలియదు. నమ్మకాల మీదా, వాటితో కూడిన మతం మీదా, మతం పేరుతో వున్న సంప్రదాయాల మీదా, ఇంకా కొన్ని ఆర్థిక అంశాల మీదా సమాజం ఆధారపడివుంది. దాంతో సర్దుకోవడానికి అవస్థ పడుతున్నాము. ఈర్ష్య, భయం, లోభం, సంపాదనా యత్నం, అపుడపుడు తళుకుమనే ప్రేమ - వీటినుండి పుట్టిందే సమాజం. నీవు క్రొత్త సమాజాన్ని సృష్టించాలంటే ఆర్జన, ఈర్ష్య, లోభం అత్యాశలనుండి విడుదల పొందాలి.

"నిజానికి ఇన్డివిడ్యువల్ అనేదాని మూలార్థం ఇన్డివిజిబుల్ – Individual is indivisible.

అనగా వ్యక్తి అవిభాజ్యమైన వాడు అని అర్థం. ముక్కలు చెక్కలు కాని వాడే వ్యక్తి. హృదయం, మనసు, దేహాల మధ్య సంపూర్ణమైన ఐక్యత ఉండాలి. స్మృతి, కోరిక, భయం, వినోదం బాధ మున్నగు వాని ద్వారా కార్యకలాపాలు జరుగుతున్నంత కాలం ఘర్షణ, గందరగోళం, వ్యతిరేకతలు తప్పవు. తాత ముత్తాతలు సృష్టించిన ఈ సంస్కృతే మన ఉనికికి కారణం. అదే దుఃఖాన్నీ విభజనమూ ఘర్షణమూ తెచ్చిపెట్టింది. ఘర్షణే అవినీతి. దానివల్ల శక్తి వృధా అవుతుంది. తనకు తాను సంపూర్ణంగా అర్థం చేసి కొని, తన మొత్తం గమనాన్ని లోతుగా పరిశీలించి, చైతన్యవంతంగా కేవలం పరిశీలన చేస్తే, ఘర్షణ అంతం అవుతుంది. అదే ధ్యానం.

"ప్రపంచమంటే నీవే. ప్రపంచ సమస్యలకు కారణం నీవే. వాటిని పరిష్కరించుకొనే బాధ్యత కూడ నీదే......... సమస్యా పరిశీలనలోనే పరిష్కారమున్నదని గ్రహించు" అని గుర్తుచేశాడు.

"వ్యక్తిగత ప్రేమ నాకు లేదు. ప్రపంచాన్ని ప్రేమించడం మానవు" అని నొక్కి చెప్పారు. "మనం ఆఫ్రికా వాళ్లం, ఐరోపా వాళ్లం వంటి అర్థం పర్థం లేని జాతీయతా వాదులం కాము. మనం మానవులం" అని మానవత్వానికి మకుటం పెట్టాడు కృష్ణజీ.

కృష్ణజీ తత్త్వం జీవించడంలోనే వుంది. పుస్తకాల్లోనూ, ప్రసంగాల్లోనూ ఉండేది తత్వాన్ని గూర్చిన చింతన, లేక విషయ వివరణ మాత్రమే. "వేదాంత మంటే సత్యాన్ని ప్రేమించడం, సిద్ధాంతాలను ప్రేమించడం కాదు" అని ఒక ఇంటర్వ్యూలో చెప్పారు. తత్త్వం, వేదాంతం అనే పదాలు ఒకే అర్థంలో వాడతాం. జీవితానికి సంబంధించిన వస్తువుల విషయాల లోతు పాతులను తెలిసికొని, వాటిని జీవితానికి అనువుగా మలుచుకోవడం తత్త్వం. ఇది వాస్తవ

దృష్టి. అయితే వేదాంతానికి దైవసంబంధమైన భావం పట్టడం వల్ల అది ఊహాత్మకమైంది. కృష్ణజీ తత్త్వం మాత్రం వాస్తవమైంది.

మహోన్నతుడైన ఈ తత్త్వదర్శి మదనపల్లిలో 1985 మే 12న తొలి అర్ధగంటలో పుట్టాడు. సంజీవమ్మ నారాయణయ్యల ఎనిమిదవ బిడ్డగా పుట్టాడు. ఇంగ్లాండులో ప్రేమ పూర్వకంగా పెరిగాడు. అమెరికాలో ఆత్మీయంగా బ్రతికాడు. ఓహైలో ఆర్య విహార్ నిర్మించాడు. అందుకే అతడు భారతీయుల కన్నబిడ్డ, ఆంగ్లేయుల ముద్దు బిడ్డ, అమెరికనుల గారాబు బిడ్డ. 91 ఏట 1986 ఫిబ్రవరి 17 న కాలిఫోర్నియాలో దేహ త్యాగం చేశాడు.

ఏకాకి కాదతడు ఏకాంతుడు
చీకట్ల లోకాన వెలుగాతడు
ఎప్పటి కప్పుడు గ్రహించి
ఉన్నది ఉన్నట్లు చూసి
క్షణ క్షణం జాగృతి గల
అనురాగపుటంబోనిధి.

(రేడియో ప్రసంగం – కడప, 1988)

* * *

# "జిడ్డు" చేసిందేమిటి?

జిడ్డు కృష్ణమూర్తి మదనపల్లిలో పుట్టాడు. ప్రాథమికవిద్య కదిరిలోనూ, మదనపల్లిలోనూ, మద్రాసులోనూ అభ్యసించాడు. దివ్యజ్ఞాన సమాజంలో పెరిగాడు. ఇంగ్లాండులో చదివాడు. అమెరికాలో, కాలిఫోర్నియాలో నివాసమేర్పరచు కొన్నాడు. డెబ్బయిఏండ్లు ప్రపంచమంతటా తిరిగాడు. ప్రబోధాలు చేశాడు. ప్రపంచబోధకుడుగా, తత్వ జిజ్ఞాసువుగా, విశ్వదార్శనికుడుగా, విద్యాలయ స్థాపకుడుగా, మానవ వైతాళికుడుగా, నిత్య చైతన్యవంతుడుగా, సౌందర్యరాశిగా, ప్రేమ మూర్తిగా, ఆనందపూర్ణుడుగా పేరుపొందాడు. 1895 మే 11 అర్ధరాత్రి దాటాక పుట్టాడు. 1986 ఫిబ్రవరి 16 అర్ధరాత్రి దాటాక గతించిపోయాడు. రమారమి తొంభై ఒక్క సంవత్సరాలు జీవించాడు.

కృష్ణమూర్తి చేసిందేమిటి? అందులో కొత్తదనమేమిటి? అది మనకెంతవరకు అవసరం?

ముఖ్యమైన కొన్ని అంశాలగూర్చి మాట్లాడుదాం.

## ఆధ్యాత్మిక రంగం: సాంస్కృతిక వారసత్వం

ఆధ్యాత్మిక రంగంలో భారతదేశం ప్రపంచానికే గురువని గర్వపడుతుంటాం. మొదట విజ్ఞానమంటూ పుట్టుకొచ్చింది ఈ దేశంలోనేనని బాకా వూదుతుంటాం. మన సంస్కృతి అఖండమైందని అంటాం. దానికి ఐదువేల సంవత్సరాల చరిత్ర వుందని పొగుడుతుంటాం. అనుకోవడానికి అంతా బాగానే వుంది. అలాంటి ఆత్మతృప్తి మాటలతో కృష్ణమూర్తి సరిపెట్టుకోలేదు.

ఇప్పుడు నేను ఏమిటని కృష్ణమూర్తి నిలదీశాడు. ఎందుకు నేను ఇంత వంచనతో, ఘర్షణతో కూడుకొని వున్నానని ప్రశ్నించాడు. మానసికమైన జీవనానికీ, అంతరంగికమైన బ్రతుకునకూ

ఆధ్యాత్మికమని మొదట్లో భావించినా, తర్వాత తర్వాత ఆధ్యా త్మికం అనే శబ్దాన్నే వదలిపెట్టాడు. ఆ పదం చుట్టూ ఒక పారంపర్యంగా వచ్చిన విశ్వయార్థం, జీవితానికి సంబంధంలేని దైవ భావం చేరిఉన్నందున ఆ పదాన్ని, ఆపదం పేర నున్న జీవితాన్ని కాదన్నాడు.

ఆత్మ, పరమాత్మ మానవ కల్పితాలని వాటిని వదిలాడు. అతని జీవితానికి వాటితో ప్రమేయం లేదు. "ఆత్మ, అహం అను వాటికి ఆధారం కాంక్ష....... కాంక్షలతో కూడిన వాడు శాంతితో వుండలేడు........ శాంతి ప్రార్థనలో లేదు, సంబంధంలో కలదు........ ఆశ అంటే స్వార్థపూరితమైన వాంఛ........ వాంఛ అంటే ఫలాపేక్ష. అది హృదయాన్ని సంకుచితంజేస్తుంది........ కాంక్షకు మూలం జ్ఞాపకం" అని బాగా గ్రహించాడు. అందుకే ఆత్మ, అహం, కాంక్ష, ఆశ, స్వార్థం, ఫలాపేక్ష మున్నగు వాటికి జీవితంలో చోటివ్వలేదు.

మతం స్వేచ్ఛను హరిస్తోంది; మనుష్యుల్ని విడదీస్తోంది. మతాల్లో వున్నది ప్రచారమేగాని వాస్తవికతకాదు. పోతే కులాల దురభ్యాసాలు కల్మషపూరితాలైన ముసుగులు. అందుచేత మతాన్ని మూలకు నెట్టాడు, కులాన్ని తుడిచిపెట్టాడు. అంతేకాదు, "నేను మీ జీవితా లకు అద్దంలాంటి వాడిని. మీ జీవితాలను అద్దంలో చూసుకొని, అద్దాన్ని పారవేయవచ్చును" అని దార్శనికుడైనాడు.

అలాగే కృష్ణమూర్తి సంస్కృతినీ, సంప్రదాయాన్నీ వదిలాడు. సరికొత్తగా బ్రతికాడు. అఖండమైన చైతన్యంతో, జాగృతితో మెలి గాడు. అతడు ఒక వ్యక్తిగాకాక, ఒక శక్తిగా రూపొందాడు. ఆ శక్తివల్ల అతనికి మానవత్వం సిద్ధించింది. అందుకే అతనికి విశ్వ జనీన దృష్టి, వసుధైక కుటుంబ తత్వమూ ఏర్పడ్డాయి.

ఇలాంటి ధోరణితో "జిడ్డు" మహత్తరమైన విశ్వమానవుడు

అయ్యాడు. సమాజాన్ని వదలకుండా, సమాజానికి లోబడకుండా, సమాజాన్ని పరిశీలిస్తూనే ఆనందమూ, ప్రకాశమూ పొందాడు. పరివర్తన వ్యక్తి హృదయంలో ప్రారంభం కావాలన్నాడు. సంస్కారణవల్ల దుఃఖం తొలగదనీ, స్వభావంలో మార్పు రావాలనీ తాను సంపూర్ణంగా మార్పు చెందాడు.

కాబట్టి జాతీయతా, సంకుచిత మతాలోచనా, కులభావనా మున్నగు మానసిక విభజనాంశాలనుండి వ్యక్తి స్వేచ్ఛ పొందాలి.

విజయ కాంక్షతో పోటీ పడి మనలను మనం నాశనం చేసికొంటున్నాము. ద్వేషాగ్నులు రెచ్చిపోతున్నాయి. స్వార్థం పెచ్చు పెరిగి పోయింది. పోటీని ప్రతి రంగంలో ప్రతి స్థాయిలో ప్రతివారిలో పోషించి, పెంచి, పెల్లుబుక చేస్తున్నాము. దాంతో ఘర్షణ, అశాంతి, భీభత్సం, యుద్ధం, వినాశనం కలుగజేస్తున్నాము.

అలాగే ఒకదాన్తో ఒకటీ, ఒకరితో ఒకరినీ పోల్చి చూస్తున్నాం. దాని ఫలితం అనుకరణ, దురాశ, నిరాశ పెరిగిపోతున్నాయి. స్వేచ్ఛ పోగొట్టుకోవడం, శక్తి వృధా చేయడం, బానిసతత్వం పెరగడం, ఆధారపడడం, శరణ్యం కావడం చూస్తున్నాము. పోల్చకుండ ఆసక్తినీ, శ్రద్ధనూ పెంచుకొని, సర్వ శక్తులనూ సమీకరించుకొని కృషి చేయలేమా? ఒక ఒరవడికీ, పద్ధతికీ, మార్గానికి అలవాటు పడ్డ సమాజాన్నీ, వ్యక్తులనూ మార్చడం కష్టంగా వుంది. వృద్ధులలో మార్పురావడం ఇంకా కష్టంగా వుంది. వాళ్లెక్కువగా గతానుభవాల్తోనే జీవిస్తుంటారు. అందుకే వర్తమాన చైతన్యం వుండదు, చైతన్యం లేకపోతే మార్పు వుండదు. క్రొత్తదనమూ వుండదు. తాజాతనమూ లేదు.

పోటీ లేకుండా, పోలిక లేకుండా చిన్నతనం నుండీ మార్పు రావాలని కృష్ణజీ భావించాడు. బిడ్డలను ఆ విధంగా పెంచాలనుకున్నాడు. అందుకై కృష్ణమూర్తి, 'ఫౌండేషన్' ద్వారా వినూత్న

పాఠశాలలు స్థాపించాడు. అవి ఋషివ్యాలీ, రాజఘాట్ (కాశీ), బెంగుళూరు, బొంబాయి, మద్రాసు, బ్రాక్‌వుడ్ (ఇంగ్లండ్), ఓహై (అమెరికా) లలో నడుస్తున్నాయి. విద్యాబోధనలో విప్లవం తెచ్చాడు. విద్యార్థుల్నీ, ఉపాధ్యాయుల్నీ కలిపి, చర్చించి, ఇరువురి లోనూ మార్పురావలసిన అగత్యం చూపించాడు.

కృష్ణమూర్తి తన జీవితం ద్వారా చూపించినవి క్రొత్తవి కావా? ఈ భీతావహమైన లోకంలో, కుత్సితమైన సమాజంలో, చివరిదాకా సంపూర్ణంగా విశ్వసించడానికి ఒక్కడూ దొరకని ఈ మానవా రణ్యంలో అతడు చెప్పినవీ చేసినవీ అవసరమైనవి కావా? బాగా యోచించండి. పరిశీలించండి. ఎవరికి వారు తెలుసుకోండి.

కనుకనే ఆతడు
కులమత గురుదైవాలను
కుటిలజాతి భేదాలను
జటిలమనోబంధాలను
పుటమార్చిన బడబాగ్ని.

(ఒక వ్యాసం, గూడూరు-1989)

* * *

# ఆలోచనా కాలుష్యం!

బిడ్డ పుట్టగానే కెవ్వుమంటుంది. అది ఆలోచనతో చేసే పనా? కాదు. కడుపులోని వత్తిడి నుండి బయటపడగానే స్పందించడం సహజం. దేహం చలిస్తుంది. దానికి తెలివి వుండడం కూడ నైజమే. దేహం స్పందించడం వల్ల వచ్చేవి చిక్కులు కావు. ఆ స్పందనలు పీడించవు. కాని ఆలోచన మనిషిలో ప్రవేశించగనే సమస్యలు మొదలవుతాయి.

మనిషి మనుగడకు ఉపయోగపడే ప్రధానమైన పనిముట్టు మెదడు. కర్మేంద్రియాలు, జ్ఞానేంద్రియాలు నాడీ మండల సహాయంతో పనిచేస్తాయి. నాడీ మండలానికి కేంద్రస్థానం మెదడు. మెదడు నుండి అన్ని వైపులకు అవసరమైన ఆజ్ఞలు జారీ అవుతుంటాయి. భౌతిక అవసరాలు తీరడానికి మెదడు తప్పనిసరిగా పనిచేయాలి. కొన్ని సందర్భాలలో దానంతటి కదే తెలివిగా పనిచేసే శరీరం మెదడు సాయంతో విశేషంగా, చురుకుగా పనిచేస్తుంది. సాఫీగా నడుస్తుంది.

కళాభ్యుదయానికీ, సైన్సు అభివృద్ధికీ మెదడు ఒక పద్ధతిలో పనిచేయాలి. వాటివల్ల మానవునికి సౌఖ్యం, హాయి, ఆనందం లభిస్తాయి. ఆ మేరకు మెదడుకు శిక్షణ యివ్వాలి. ఒక మూసలో పెట్టాలి. ఒక విధానం కల్పించాలి. అందుకు తగినట్లుగా మెదడులోని కణాలు తయారవుతాయి, మార్పిడి చెందుతాయి. అదే నిబద్ధత చేయడం లేక కండిషనింగ్. అంతేగాక భౌతికావసరాల మేరకు మెదడును నిబద్ధత చేయకతప్పదు. ఈ నిబద్ధత వస్తువులపైనా వాస్తవ విషయాలపైనా ఆధారపడివుంటుంది. అందుచేత చిక్కులు సంభవించే అవకాశం చాలతక్కువ. అపుడు మెదడు మనసుకు చక్కగా వినియోగపడుతుంది. విశాలదృక్పథంతో పనిచేస్తుంది. తెలివిగా, ప్రేమగా వ్యవహరిస్తుంది.

ఇకపోతే మానసిక సంతృప్తి కోసం మెదడును నిబద్ధించడం జరుగుతుంది. అది వస్తువును గూర్చిగాక, వస్తువుకు సంబంధించిన విషయంపై లేక జ్ఞానంపై చింతించడం జరుగుతుంది. అంటే అభిప్రాయాల గూర్చి విచారించడం అవుతుంది. మరియు ఊహాత్మకంగా భావించడం జరుగుతుంది. అక్కడే ఆలోచన మొదలవుతుంది. ఆలోచన వస్తువు కాదు, స్వతంత్రమైనది కాదు. అది వస్తువిషయిక జ్ఞానంపై, అనుభవంపై ఆధారపడి వుంటుంది. గతం మీద ఆధారభూత మవుతుంది. ఆయాలోచన ఒకే రీతిలో నడవదు. అనేక విధాలుగా సాగుతుంది. పరస్పర విరుద్ధంగా వుంటుంది. ఆలోచనలు గతంపైనా, తెలిసిన దానిపైనా, కాలంపైనా ఆధారపడి వుంటాయి. కనుక ఎప్పుడూ పరిమితికిలోనై వుంటాయి. కనుక అవాస్తవధోరణి ద్యోతకమౌతుంది. అంచేత ఆలోచన ఘర్షణతో కూడి వుంటుంది. లోకంలో జరిగే అవాంఛనీయ సంఘటనలకు ఆలోచనా ఫలితాలైన గుర్తింపులు, విభేదాలే కారణం.

అవాస్తవికంగా నిబద్ధమైన మెదడు మొద్దుబారిపోతుంది, బద్ధమైపోతుంది. దాంతో మనసు సరియైన సంబంధం పెట్టుకోలేదు. సరికదా మనసు కూడ ఆ మేరకు మూసుకుపోతుంది. మూర్ఖంగా వుంటుంది. ఆలోచనతోనే బంధమేర్పడుతుంది. బంధమంటే అహం. గ్రహింప బడిందంతా అహంతో ఘనీభవిస్తుంది. ఎంత జ్ఞానం సంపాదిస్తే, ఎంత ఆలోచన చేస్తే అహం అంతగా వ్యాపకమౌతుంది. ఇది ఒక వలయం.

ఇంతవరకు ఇది ఆలోచన గూర్చిన వుపోద్ఘాతం. ఇక కృష్ణజీ చెప్పినదేమిటో పేర్కొనబడుతుంది.

మనసు మెదడుకు వెలుపల వుంది. మాటలతో, ఆలోచనతో మనసును కొలవలేము. మనసు మెదడు పొందిన నిబద్ధతకు వేరైంది. మెదడు యొక్క పనిని కొలవవచ్చు, ఆ కొలతకే కాలమని పేరు.

మనం వుపయోగించే మెదడు భాగం ఆలోచనతో నిబద్ధమైంది, ఘర్షణతో నిబద్ధమై వుంది. ఆలోచన పరిమితం గనుక పరిమితమైన దానికి ఘర్షణ తప్పదు. ఆలోచనకు పనిముట్టుగా మెదడు వాడ బడుతుంది. నిబద్ధమైన మెదడుకు మనసుతో పూర్తి సంబంధం వుండదు. ఆలోచన ఆగినపుడు మెదడు మనసు హెచ్చరికను గ్రహిస్తుంది. అపుడు మనసు మెదడుతో కలిసి మెలిసి మాటపల్కు లతో వుండగలదు. నిబద్ధతనుండి స్వేచ్ఛ లభించినపుడు అంతరదృష్టి పుడుతుంది. అదే అసలు మనసు, అదే అత్యున్నతమైన తెలివి. ఈ పరిశీలన ఆలోచనతోనూ, కాలంతోనూ సంబంధంలేనిది. వినేది మెదడే. అది నిశ్శబ్దంగా ప్రశాంతంగావుంటే అంతర్దృష్టి ఏర్పడు తుంది. అంతర్దృష్టి మనసుకు బలాన్నిస్తుంది. అదిలేక కొందరు నిశ్చయాత్మక బుద్ధి నలవరచు కుంటారు. నిశ్చయబుద్ధి కలవారు పరిశీలన చేయరు.

నేను (ఆత్మ) అనేది జ్ఞాపకాల పుట్ట. జ్ఞాపకాలు చచ్చినవాటితో సమానం. అవి గడిచిపోయిన గతంనుండి వస్తాయి. ఆ పుట్టలోకి అంతర్దృష్టి ప్రవేశిస్తే 'నేను' అంతమవుతుంది.

"ఇప్పుడు" అనేదాంట్లో జ్ఞాపకం వుండదు. వర్తమానమే ఇప్పుడు. ఏదో కావడమంటే జ్ఞాపకాలు పోగుచేసి కోవడమే. జ్ఞాప కాలు లేని స్థితే దయ. ఆ దయయే అత్యున్నత తెలివి.

కృష్ణజీ చెప్పిన వివరంలో సారాంశం ఏమంటే, దేని నిమిత్త మైనా సరే చివరికి ఆలోచనకావల వుండే దాన్ని తెలిసికోవడా నికైనా సరే మెదడుకు శిక్షణ యివ్వడం సంస్కృతి అంటారు. అంటే శిక్షణా, సంస్కృతీ అంతా వొకటే. ఇపుడు ఆలోచనే సంస్కృతి అయింది. అయితే ఆలోచన వేరు, ఆలోచనాపరుడు వేరని ఆ మనసే విభేదం కల్పిస్తూ వుంటుంది. కల్పనలూ వ్యత్యా సాలూ, మనోముద్రలూ, అనవసర గుర్తింపులూ-అన్నీ ఆలోచనా కాలుష్యాలే. తెలియని దానికి ఆలోచన సాగలేదు. అంచేత తెలి

సిన దాన్నుండి విముక్తి పొందడమే మనసు చేసేపని.

చెడు అనేది వాస్తవంగా వుంది. దానికి ఆలోచన అనే ఆజ్యం పోయరాదు. కనుక మౌనం వహించాలి. కాని ఈ మౌనం మాటలకు మారురూపం కారాదు. ప్రాపంచిక వస్తువులకు బదులుగా మౌనానందాన్ని కల్పించేది ఈ ఆలోచనే. అందుకే శాశ్వతం, అశాశ్వతం, నీచం అని భాగాలుగా సృష్టిస్తుంది ఆలోచన.

ఆలోచన అనవసరమైన గుర్తింపులూ ముద్రలూ తెచ్చిపెడుతుంది. అత్యధికమైన రంగు పులుముతుంది; కులం, మతం, జాతి, అంతస్థులు, సృష్టించి మనిషిని విడదీస్తుంది. అది నిర్మించే ఖాళీలో 'నేను' వుంటుంది. కాని ప్రేమ వుండదు. 'నేను' లేని ఖాళీలోనే ప్రేమ వుంటుంది. ధ్యేయానుభూతియనే ఆలోచన ఆకాంక్షరూపంలో ఆనందాన్వేషణకు తాపత్రయ పడుతుంది. ప్రేమను ప్రక్కకు నెడుతుంది, లేక నాశనం చేస్తుంది. గతానుభవం రాలిపోయిన ఆకులాంటిది. కేంద్రబిందువుగా అహంలేనపుడు మనసుకు అవధిలేదు. అపుడు ప్రశాంతతా, విశాలతా కలిసే వుంటాయి. లోతైన ధ్యానంలో ధ్యేయం లేదు. కాన అనుభూతికై ఎదురు చూడడం లేదు.

భౌతికావసరాలకు మించి మస్తిష్కాన్ని నిబద్ధించడం వల్ల మనసు చెడి, మలినమైపోతుంది, సంకుచితమై పోతుంది. ఆలోచనా కాలుష్యం వల్ల ఆకాశంలాంటి మనసుకు మబ్బు పడుతుంది.

'నేను' లేనిదే నూతన మనస్సు
సమగ్రమైందే నూతన మనస్సు
స్వేచ్ఛ గలదే నూతన మనస్సు
అదే ఉషస్సు, "మంచి" మనస్సు

(ప్రత్యేకవ్యాసం — గూడూరు-1989)

* * *

# తత్వవేత్త జిడ్డు కృష్ణమూర్తి

శ్రీ జిడ్డు కృష్ణమూర్తి 1985 లో జన్మించారు. 91 ఏళ్లకు పైగా బ్రతికారు. 1986 లో చనిపోయారు. సుమారు 60 ఏళ్లు బోధన చేశారు. వారి భాషలో చెప్పాలంటే సంభాషించారు. ఎందుకంటే ఉపదేశం, సందేశం, ఉపన్యాసం వారికి గిట్టవు. తెలిసి చెప్పేవారూ, తెలియక వినేవారన్న వ్యత్యాసం తగదన్నారు. చెప్పినది అంగీకరించడం గానీ, కాదనడం గానీ, పోల్చి చూసుకోవడంగానీ లేకుండా వినమంటారు. చెవులతోనే గాకుండా మనసు పెట్టి వినమంటారు. చెవులూ, మనసూ, హృదయమూ పెట్టి నీ మొత్తం ఉనికితో వినమంటారు.

మరో విధంగా చెప్పాలంటే, ఇద్దరు నిజాయితీ పరులు ఒక తోటలో చెట్టుక్రింద చేరగిలబడి కష్టసుఖాలు చెప్పకుంటున్నారు. ఒకరు చెప్పింది ఒకరు అర్థం చేసుకుంటున్నారు. అలా వినమంటారు.

నిర్లిప్తమైన మనసులో, హృదయ పూర్వకమైన వినికిడిలో తార్కికమైనదీ, హేతుబద్ధమైనదీ, జీవితానికి సంబంధించినదీ, వాస్తవమైనదీ ప్రవేశిస్తుందని వారి భావన. అదే అవగాహన. అవగాహనే క్రియాశీలత. ఆ విధంగా మంచి మిత్రుడుగా వారు ప్రపంచమంతటా బహుజనాళితో కలిసి చింతించారు, చర్చించారు.

పరీక్షల చదువు మీద కన్నా ప్రకృతి పరిశీలన మీదా, లోతైన జీవితపు విలువల మీదా ధ్యానం మీదా ఎక్కువ మక్కువ చూపారు. 28వ ఏట సంపూర్ణ పరివర్తన చెందారు. మానవతా సంపూర్ణ తను జీవితంలో సాక్షాత్కరించు కున్నారు. ఎఱుకలో-నిద్రలో, నడకలో-పడకలో, ధ్యానంలో- ప్రయాణంలో, మాటలో-మౌనంలో, చూపులో-చేష్టలో ఎపుడు పడితే అపుడు అపూర్వ తన్మయతానందంలో ఓలలాడారు.

## కృష్ణమూర్తి చెప్పింది వేదాంతమా?
## సంప్రదాయార్థంలో కాదు!

ఈ గడ్డపై ఎందరో అవతార పురుషులుద్భవించారు, ఎన్నోధా ర్మిక ప్రబోధాలు చేశారు, వేదవిదులూ, వేదాంతజ్ఞులూ వున్నారు, సర్వవిజ్ఞాన విభూషితాలైన వేదాలున్నాయి. అంచేత ఈ కృష్ణమూ ర్తితో పనియేమి అనుకోవచ్చు!

కృష్ణమూర్తిలో ఈ రోజుకు కావలసిన ప్రత్యేకత వుంది. మాన వుడు కేవలం మానవుడుగానే వృద్ధిచెందాలి. అంటే ఒక సిద్ధాంతం ప్రకారమో, మతం ప్రకారమో, అభిప్రాయం ప్రకారమో, జాతిభావన ప్రకారమో గాక మానవ మాత్రుడుగా బ్రతకాలి. ఒక కులస్థుడుగానో, ఒక మతస్థుడుగానో, ఒక జాతివాదిగానో, ఒక కమ్యూనిస్టుగానో వ్యవహరించడమే అనర్థం అంటారు.

మానవుడుగా వికసించాలంటే సంపూర్ణస్వేచ్ఛ, అనిబద్ధత, నిర్భయత, అంతరంగదృష్టి, లోతైన పరిశీలన వుండాలి. తన్ను తాను సతతం తెలుసుకుంటూ వుండాలి. SELF KNOWLEDGE అవసరమంటారు. ఆత్మజ్ఞాన మనవచ్చుగాని, వేదాంతులు చెప్పే ఆత్మకాదు. స్వయంజ్ఞానం అనవచ్చు. ఆక్షణంలో తనకున్న మానసిక ప్రవృత్తినీ, గుణగణాలనూ, పోకడలనూ, చేష్టలనూ దేనికీ అంటకుండా పూర్తిగా గమనిస్తూ, వాచ్ చేస్తూ వుండడం. అదే ఆయన దృక్పథంలో అవికల్పమైన ఎఱుక, ఎన్నరానీ; ఎన్నుకోనీ ఎఱుక - CHOICELESS AWARENESS.

## జ్ఞానాంతమే వేదాంతం:

ఈ పరిశీలనలో గతం ఎప్పటి కప్పుడు విస్మృతం అవుతుంది. అంటే గడించినదీ, అనుభూతి చెందినదీ, తెలిసినదీ ఎప్పటికప్పుడు మరుగున పడిపోతుండాలి. విషయం అనుభూతికాగానే అనుభవం అవుతుంది. అనుభూతి చెందడమంటే వర్తమానక్రియ. అనుభవం అంటే గతించిపోయిన అనుభూతి. విషయం అవగాహనకు వచ్చిన

పుడు అనుభూతి కలుగుతుంది. ఆ పిదప స్మృతిగా, జ్ఞాపకంగా మిగుల్తుంది. మస్తిష్కపు పొరలలో నిలవ వున్నదే జ్ఞానం. జ్ఞానం నుండి ఆలోచనలు పుట్టుకొస్తుంటాయి. కాబట్టి గతం ఆధారంగా పుట్టుకొచ్చే ఆలోచనలు వర్తమాన మానవ మానసిక సమస్యలను తీర్చలేవంటారు. ఎందుకంటే అంతరంగ వృత్తి ఎప్పటికప్పుడు మారి పోతూవుంటుంది. అందుకే ఇద్దరి మధ్య వున్న మానసిక స్థితి, సంబంధం, అనుబంధం ఎల్లప్పుడూ అలాగేవుండదు. ఇది మన నిత్యసత్యం. ఆలోచనలు అణగారిన వెంటనే, మనసుకు నిబ్బరం, నిదానం, సమస్థితి లభిస్తాయి. సమస్యకు పరిష్కారం లభిస్తుంది. సమస్యలోనే పరిష్కారముందంటారు. అందుకే సమస్య స్ఫటికంలా స్పష్టంగా తెలియాలి.

ఇకపోతే, తెలిసింది జ్ఞానమన్నాం. తెలిసింది కాబట్టి దాన్ని వేద మన్నాం. 'విత్' అనే ధాతువు నుండి వచ్చింది విద్య. అంటే తెలియతగింది. వేదం అంటే తెలియబడింది. కాబట్టి తెలిసిందాన్ని అంతం చేస్తేగాని, గతం వదిలితే గాని, వర్తమానంలో వికాసం వుండదు. వేదం అంత కావడమే వేదాంతం. వేదం అంటే జ్ఞానం KNOWLEDGE, అంతం అంటే ENDING. ENDING OF KNOWLEDGE IS VEDANTA అని వారు చెప్పారు. అలా బ్రతికారు. గతానుభవాలూ గత స్మృతులూ, శ్రుతులూ, పురాణేతి హాసాలూ పరాధీనతను కల్గించేవే గాని, స్వేచ్ఛా వికాసాలు కల్గించవంటారు. పైగా మతపరమైన ఈ శాస్త్రాలు మనిషిని మనిషినుండి చీల్చేస్తు న్నాయనీ, ఈ నాటి సమాజంలో అనైక్యతకూ, హింసకూ అవి కారణాలనీ వాటివి త్యజించమన్నారు. అనుభూతమైన వస్తుతత్వం మీదా, వాస్తవికతమీదా ఆధారపడమన్నారు.

## ద్వంద్వ దృక్పథాలు:

లోకంలో రెండు దృష్టులు కల్పించారు. ఒకటి భౌతికం, రెండు ఆధ్యాత్మికం. ఈ రెండూ అవసరమనీ, రెంటికీ సమ గ్రత చేకూర్చాలనీ కొందరు బోధిస్తున్నారు. కాని కుదరడం లేదు.

భౌతికం మనకు తెలిసిందే. అది వృత్తివిద్యకు సంబంధించింది, జీవనానికి అవసరమైంది, నవీన విజ్ఞాన శాస్త్రానికి సంబంధించింది. అంతటితో సరిపుచ్చుకుంటే, పదార్థ సమానత్వం లభిస్తే జీవితం పూర్తికాదు. సమాజం సంఘర్షణకు నిరంతరం లోనవుతోంది. హింస, పోటీ, క్రూరత్వం ప్రవేశిస్తున్నాయి. మనం చూస్తు న్నాము. ఇక ఆధ్యాత్మికం (SPIRITUAL) అంటారా అది కృష్ణ మూర్తి దృష్టిలో చెల్లదు. ఎందుకంటే అది ఊహకు, పరలోకాలకు, బ్రహ్మకు, ఆత్మకు సంబంధించింది. అదంతా ఊహించే మనసు కట్టే గాలిమేడలు; అవాస్తవం. కాబట్టి ఆ భ్రమలో పడవద్దు. కాని నీలో ఎంత అసహ్యత వుందో, ఎంత క్రౌర్యం వుందో, ఎంత స్వార్థం వుందో, ఎంత అసూయవుందో, ఎంత కక్షవుందో, ఎంత అహంభావం వుందో చూచుకోమంటారు. అలాంటివి లేని అంత రంగవృత్తి, ప్రేమ, కరుణ, తెలివిగల సంవేదనాభావం, స్పందన కల్గివుండడం అసలు దృష్టి అంటారు. కనుక భౌతిక విజ్ఞానాన్నీ, అంతరంగ ప్రసన్నతనూ కలిపి ఏక దృష్టితో బ్రతకడం సమగ్రత అనీ, అది మానవ వికాసానికి తోడ్పడుతుందనీ చెప్పారు. చూచే వాడు, చూడబడేది అని రెండు వుండవు. The observer is the observed. ఇది వేదాంత ఫక్కీ కాదు. సమైక్యదృష్టి, ప్రేమదృష్టి, ధ్యానదృష్టి.

**జీవితం:**

కృష్ణమూర్తి జీవితాన్ని గూర్చే మాట్లాడారు. జీవితమంటే సంబంధం. ఈ సంబంధాన్ని ఎప్పటికప్పుడు అర్థం చేసుకోమం టారు. అన్నిటికన్నా సన్నిహితమైంది భార్యాభర్తల సంబంధం. అందుచే ఆ సంబంధం పదిలంగా వుంటే ఇంట్లో ఘర్షణ లేదు. సమాజంలో సంఘర్షణ లేదు.

ఈ సంబంధాన్ని చెడగొట్టేవి ఏమిటి? మనిషిని గూర్చి ముందే మనోరూపం (IMAGE) ఏర్పాటుచేసుకోవడం. గత జ్ఞాపకాలను ప్రోగు

చేసికోవడం. ఊహాత్మక భవిష్యత్, ప్రతిబింబం మనసులో వుంచుకో వడం. కాబట్టి పరస్పరం ప్రతిబింబం ద్వారా చూసుకోవడం వల్ల, వాస్తవంగా ఉన్నది ఉన్నట్లు చూసుకోకపోవడం వల్ల సంబంధాలు బెడిసికొడుతున్నాయి.

సంబంధాలు సరిగ్గా వుండాలంటే మనో చిత్రణలతోనూ, భావా వేశాలతోనూ, గత ముద్రలతోనూ, మత సిద్ధాంత తత్వపు తెరలతోనూ చూడరాదు. అధికారాలూ, పెత్తనాలూ, పోలికలూ పనికిరావు. తెలిసిన వాడూ, గురువూ, శిష్యుడూ, హోదాలూ పనికిరావు.

సంబంధమనే అద్దం ద్వారా తనను తాను చూసుకుంటూ జాగరూకతతో జీవించాలి.

నీవు ఎలావుంటావో, నీవున్న సమాజం కూడ అలావుంటుంది. నీవే ప్రపంచానివి. కాబట్టి నీవు మానసికంగా సమూలంగా విప్ల వాత్మకంగా మార్పు చెందనిదే సంఘం బాగుపడదు. సమాజంలో కుటిలత పోవాలంటే, నీ మనసులో కుటిలత ముందు తొలగాలి.

(తిరుపతిలో రేడియో ప్రసంగంలో కొంత భాగం
తిరుపతి 17-2-1992)

* * *

# పరివర్తన అవసరమా!

మార్పు చెందాలంటారు. మారుమనసు పొందమంటారు. మని షిలో మార్పువస్తుందా, అది అవసరమా, అయితే ఎలా వుంటుంది?

సాధారణంగా మనిషి తోచినట్లు చేస్తాడు. నా స్వభావం ఇంతే అంటాడు. నా మనసు చెప్పినట్లు చేస్తున్నానంటాడు. 'నాస్వ భావం', 'నామనసు' ఎలా తయారయ్యాయి?

మనిషి శరీరంలో మార్పురావాలా, మనసులో మార్పురావాలా, ఆలోచనలో మార్పురావాలా, అన్నిటిలో మార్పురావాలా? అసలు మనసే లేకుండా పోవాలా?

దేన్నుండి మార్పు రావాలి? మార్పును గుర్తించడమెలా? వర్తమానంలో వాస్తవాలను గుర్తించడానికి విశ్లేషణ సరిపోదు. పరి శీలన అవసరం; విచక్షణా బుద్ధితో చేసేది విశ్లేషణ (analysis). సమగ్రదృక్పథంతో వుండేది పరిశీలన (observation). మొదటిది గతం మీద ఆధారపడితే, రెండోది జరుగుచున్న దానిని చూస్తుంది.

మానవుడు ప్రకృతి నుండి పుట్టాడు. ప్రకృతిలో లయమవు తున్నాడు. రెండూ చాలా సహజమైన క్రియలు. అయితే ఒకటి కోరతగిందిగా, మరొకటి కోరరానిదిగా చూస్తున్నాడు. ఈ రెంటి మధ్యకాలంలో ఎంతో భయాన్నీ, ఆందోళననూ, ఆశనూ సృష్టించు కున్నాడు. మొదట్లో ప్రకృతికి ఎంత దగ్గరగా వున్నాడో, రానురాను ప్రకృతికి అంత దూరంగా పోతున్నాడు. ఈ వికృత ధోరణి నుండి మార్పుచెందడం ఎంతైనా అవసరం. అంతేకాదు. తనకు తాను అయిష్టంగా, అసహ్యంగా, అల్లకల్లోలంగా వుంటున్నాడు. అందుకే మార్పు మరింత అవసరమయింది.

సహజ స్పందన వేరు, సంకల్ప ప్రేరణ వేరు. వెనక ముందులు పెట్టుకోకుండా, లాభనష్టాల బేరీజులు వేసికోకుండా, ఆలోచనకు

గుర్తించేయకుండా క్రియా ప్రతిక్రియలు సల్పడం సహజస్పందన. ఏర్ప డుతున్న మనసుతో, పెరుగుతున్న జ్ఞానంతో ఉద్దేశపడడం సంకల్ప ప్రభావం. అంటే అనుభవాలూ, జ్ఞానాలూ సేకరిస్తూ నిలవ చేసికో వడం జరుగుతున్నది. అదే 'నామనసు', 'నా స్వభావం'. సరుకు నిల్వవుంటే కుళ్లిపోతుంది. భారమవుతుంది. అందుకే ఎప్పటి కప్పుడు అవశిష్టాలను తొలిగించుకోవాలి - అదే మార్పు.

దేహం, ఆలోచన - రెండూ భౌతికాలే. భౌతికమైన మార్పు తెలుస్తుంది. పరివర్తించినపుడు రెంటిలోనూ, మార్పు వస్తుంది. రసాయనిక మార్పు అందులో ఒక భాగం. తనను తాను రక్షించు కొనే తెలివి, తనను తాను పోషించుకొనే తెలివి శరీరానికి సహజంగా వుంది, జంతువుల లాగానే. అయితే స్మృతి రూపంలో నిలిచిపో యిన జ్ఞానం యొక్క ప్రతిస్పందనగా వెలువడుచున్న ఆలోచన దేహానికి అడ్డుపడి, దానిని అస్తవ్యస్తం పాలు చేస్తున్నది. అందుకే ఆ అడ్డుపడేది ఒక్కొక్కప్పుడు లేకుండా పోవడం కూడ అవసరం.

ఎంత శూన్యత ఉంటే, ఎంత ఖాళీ ఉంటే అంత అమా యకత, అంత నిశ్చలత వుంటుంది. అదే సహజత్వం, అదే ప్రకాశత్వం!

వడమంత్రం ఏం చేసిందంటే పశువును నాలుగుకాళ్ల మనిషి గాను, మనిషిని రెండుకాళ్ల పశువుగాను చూసే పరిస్థితి కల్పించింది.

స్థిత ప్రజ్ఞుడెవరు, భక్తుని లక్షణాలేవి, గుణాతీతుని గుర్తించడ మెలా? - అనే ప్రశ్నలకు మనకు చక్కని వివరణ వుంది. ఆ గుణగణాలను, లక్షణాలను మన ముందుంచుకుని, అలానడవాలని ఏదో ప్రయత్నం చేస్తుంటాము. పట్టుబట్టి చేసే ఏ ప్రయత్నమూ అలా కానివ్వదు. ఎన్నటికీ ఆదర్శాన్ని అందుకోలేము. అది మార్పు కాదు. అనుకరణ మాత్రం అవుతుంది. ఎందుకంటే, ముందు పట్టుకున్నదేదో వదలాలిగాని దానిపై మరేదో పట్టిద్దామంటే పట్టు వడదు, ఇమడదు.

బంధించిన దాన్ని ఛేదించడంలోనే మార్పు ఉంది. ఏది క్రొత్తగా తెచ్చి పెట్టుకున్నా అది మార్పుకాదు. ఏమీ లేని స్థితికీ, ఏదీకాని స్థాయికీ పోవడమూ, మొదటి అమాయక పరిస్థితి పొందడమూ ఆ మార్పు. అది స్వచ్ఛందంగా జరగాలి. పూర్తి స్వేచ్ఛలోనే అది సాధ్యం. అది ప్రబోధంలోనూ ప్రచారంలోనూ గాక, బ్రతుకులోనూ ప్రవర్తనలోనూ కనపడాలి.

కావలసింది రూపాంతరం చెందడం కాదు, పరివర్తన చెందడం. సంపాదించిన జ్ఞానంతో, అభిప్రాయాలతో మెదడులోని కణాలు ఒక స్థితికి నిబద్ధమై ఉంటాయి. అలా చట్రంలో బిగిసిపోతాయి. దాన్ని ప్రశ్నించకుండా, తదనుగుణమైన సమాచారాన్ని ఇంకా ఇంకా చేకూర్చుకోవడంతో ఆ బౌద్ధిక స్థితి మరింత ఘనీభవిస్తుంది. దానికి తగినట్లుగా శరీరంలోని జీవకణాలు అమరి ఉంటాయి. అలాగే పోషణ, శోషణ చెందుతుంటాయి.

తీవ్రాసక్తిలో 'ఉన్నస్థితి' పై అగ్నిలాంటి అంతర్దృష్టి ప్రసరించినపుడు మెదడు కణాలు పూర్తిగా చలించి పోతాయి. అవి విడుదలై పోయి, వేరే అమరికను పొందజూస్తాయి. శరీరంలో కూడ రసాయనిక మార్పులొస్తాయి. అపుడు మెదడు 'మనస్సు' కు అందుబాటౌతుంది. పరివర్తన లేక మ్యూటేషన్ చెందుతుంది.

నిజానికి మెదడు ఆలోచనకు స్థానం, భౌతికమైంది, యాంత్రికమైంది, సంప్రదాయ బద్ధమైంది. 'మనసు' కాలమాన ఆలోచనలతో భాగస్వామ్యమైంది కాదనీ, కాలం-వ్యవధి-అభ్యాసం వల్ల మంచితనం రాదనీ శ్రీ జిడ్డు కృష్ణమూర్తి చెప్పారు.

(తిరుపతి రేడియో ప్రసంగం - 1992)

* * *

# జీవితం ప్రేమతత్వం

"1923 లోనే నేనతనిని గుర్తించాను; అతనిలో సోక్రటీస్ స్థాయిగల ఆలోచనాపరుడే గాక బుద్ధుని శోభాయమాన స్థితి కల్గిన ప్రబోధకుడు కూడా వున్నాడు. అతడు సర్వోత్తమ కళావతంసం".

ఈ మాటలు కృష్ణమూర్తి గురించి ప్రపంచానికి చాటినవారు ప్రొ. జి. వెంకటాచలం. "మై కాంటెంపొరరీస్" అనే 1966 నాటి గ్రంథంలో చెప్పారు.

కబీర్, తుకారాం, జయదేవులలాంటి ఆత్మోత్తేజిత మహావ్యక్తుల వలె కృష్ణమూర్తి ఒకచోట ఇలా వ్రాశారని కూడ ప్రొ. జి. వెంకటాచలం ఉదహరించారు.

"వేచి చూడు నాకై మిత్రమా
విశిష్ట జీవిత సుగంధ పరిమళం గూర్చి చెపుతా
జీవితానికి ఏ వేదాంతమూ లేదు,
కుయుక్తి విధానపు టాలోచనలూ లేవు.
జీవితానికి మతాలు లేవు
మందిరాంతర్గత ఆరాధనలూ లేవు.
జీవితానికి దేవుళ్లు లేరు
భయంకర మార్మిక బరువులూ లేవు.
జీవితానికి నివాసం లేదు,
చివరికి కృశింపజేసే వేదనాదుఃఖవాసమూ లేదు.
జీవితానికి ఆనందంలేదు, బాధలేదు,
వెంటబడే ప్రేమావిసిరి లేదు
జీవితం పుణ్యంకాదు, పాపంకాదు, సుఖంకాదు,
మరిపించే దైవవేదిపై విశ్రమించేది కాదు.
జీవితం శక్తి కాదు, పదార్థం కాదు,
క్రియ, ప్రతిక్రియల క్రూరవిభజనా కాదు.

జీవితానికి చావులేదు,
కాలపు ఛాయల్లో ఒంటరితనపు లేమిలేదు
నిత్యమైన దానిలో జీవించేవాడు నిజానికి
స్వేచ్ఛాజీవి, ఎందుకంటే అదే జీవితం!"

కృష్ణమూర్తి ఏమి చెప్పారని అడిగితే జీవితం గూర్చి చెప్పారని అంటాను. అది వేదాంతమనీ, మనోశాస్త్రమనీ, హేతువాదమనీ చెప్పలేము; జీవిత తత్వం అనవచ్చు. అయినా ఏ పేరూ పెట్ట వద్దంటారు వారు.

జీవిత విధనం గూర్చి ఎందరెందరో ఎన్నెన్ని విధాలుగానో చెప్పారు.

ఒక కాలంలో వేదాలూ, ఉపనిషత్తులూ తత్వం గూర్చి బాగా చెప్పాయి. బృగువు, పూర్ణకాశ్యపుడు, మక్కలిఘోషుడు, అజిత్ కౌశంబాల్, పాకుద్ద కచ్ఛయానుడు, సంజయబేల పుత్రుడు, మహావీరుడు (నిగంతనాధపుత్రుడు), కణాదుడు, గౌతముడు, పతంజలి, పాణిని విశేషంగా చెప్పారు. తత్వం, వేదాంతం, దర్శనం, దైవం, జీవితం గూర్చి మేధస్సూ, వైదుష్యమూ చూపారు. అన్నిటికీ మిన్నగా, అధునాతనంగా, మానవాళి మొత్తానికి సంబంధించి బుద్ధుడు ధర్మం బోధించాడు. అది సర్వోత్తమమైంది. సహేతుకమైంది. సర్వజనీనమైంది. మతానికీ, ధర్మానికీ సంబంధించినంత వరకూ ఆనాటికీ ఈ నాటికీ బౌద్ధ ధర్మం అద్వితీయం, అద్వయాతీతం. అది ప్రపంచంలో సర్వజన సమాదరణీయం.

జీవితమంటే ప్రజా సంబంధం. జీవితంలో మానవునికి ప్రకృతితోనూ, విజ్ఞాన శాస్త్రంతోనూ, సమాజ మానవులతోనూ సంబంధం వుంది. మనిషికి జనులతో వున్న సంబందం హెచ్చైనది, సన్నిహితమైంది. ఈ జీవితం పాలనలోనూ, నిర్వహణలోనూ, పురోభివృద్ధిలోనూ నిరాఘాటంగా సాగాలి, గౌరవప్రదంగా వుండాలి,

సంతృప్తిగా గడవాలి. అటు రాజకీయంగానూ (పాలనాభాగంలో), పౌర జీవనపరంగానూ (సామాజికంగా), ఇటు వ్యక్తిగతంగానూ, (చిత్తశాంతినిచ్చే సౌశీల్య ధర్మచింతనా పరంగా) మానవుడు స్వేచ్ఛగా, స్వతంత్రుడుగా, సమానుడుగా జీవించాలని చాలామంది భావించారు. అందులో ఠాగూర్, తిలక్, గాంధీ, మాలవ్యా, నెహ్రూ, జిన్నా, ఆలీ, రాయ్ మున్నగు మహనీయులున్నారు. వారందరిలో సర్వసమగ్రంగా, సమైక్యతా ధ్యేయంగా, సకల దృక్ప థౌన్నత్యంగా చెప్పినవారు డా. బి. ఆర్. అంబేద్కర్. ప్రజాస్వా మ్యానికి చక్కని భాష్యం చేశారు. సువిశాలమైన బాటవేశారు. స్వేచ్ఛ, సమానత, సౌభ్రాతృత్వం, న్యాయం అను సూత్రప్రాయ మైన స్థంభాలపై సర్వతంత్ర గణతంత్ర ధర్మస్మృతిని (అధునాతన రాజ్యాంగ చట్టాన్ని) మనకు అందించారు. ప్రజా జీవనపరంగా, వ్యక్తి వికాసానుకూలంగా, చిత్తశాంతి సాధనయుతంగా అంబేద్కర్ చెప్పింది సాధికారికం, సామేధికం, సకలజనావశ్యకం.

ప్రపంచ మానవ మానసిక జీవితంలో అనేకతత్వాలు జీర్ణిం చుకుపోయి వున్నాయి. వేదత్రిత్వం, ద్వైతం, అద్వైతం విశిష్టా ద్వైతం, మతం, దైవం, ధ్యానం ఎన్నో కలిసీ, విభేదించీ చిత్త ప్రవృత్తిలో తిష్ట వేసుకున్నాయి. శంకరరామానుజులు, సోక్రటీస్ ఫ్రాయిడ్‌లు, వివేకానంద, అరవిందులు, రస్సెల్ సాత్రేలు, ఇంకెం దరెందరో ఎంతెంతో చెప్పారు. అందరినీ అధిగమించి, తత్వాలకు తలమానికంగా జిడ్డు కృష్ణమూర్తి భాషించారు. వారి దృక్పథం సర్వ విభేద భంజకంగా, మత భ్రాంతి రహితంగా, మానవతా ఉద్దీపకంగా, వాస్తవ జీవితోపయుక్తంగా, ఉన్నదున్నట్లుగా వుంది. ఇది అద్భుతం, అధునాతనం.

జీవితం గూర్చి ధర్మబద్ధంగా చెప్పినా, ప్రజాస్వామ్యపరంగా చెప్పినా, తత్వయుక్తంగా చెప్పినా మౌలికంగా వొకటే; మనిషిలో మార్పు రావాలనీ, మానవత్వం జీవన సూత్రం కావాలనీ, సర్వ

మానవుల మీద అవిభాజ్యమైన ప్రేమ చూపాలనీ. మతం, వర్ణం, కులం మాత్రమేగాక జాతీయత కూడ విచ్ఛిన్నకరమైన మానసిక రుగ్మత అని వాటిని స్వచ్ఛందంగా వదులుకొని జీవించిన వారు కృష్ణమూర్తి.

జీవిత తత్త్వపరిశోధనలో కృష్ణమూర్తి మాత్రం గంభీరమైన విలువలనూ, అవ్యక్తమైన అనుభూతులనూ దర్శించారు. సంస్థాగత ఉద్యమాలనూ, వ్యవస్థీకృత అనుసరణ ప్రచారాలనూ, వ్యక్తియొక్కా గ్రంధం యొక్కా అధికారాలనూ, సిద్ధాంత - సూత్ర - విశ్వాస - అభిప్రాయాలనూ, గతానుభవ స్మృతి బంధాలనూ పూర్తిగా నిరసించారు.కాని బౌద్ధ విజ్ఞానమూ, వైఖరీ కృష్ణమూర్తిలో తప్పక ద్యోతక మౌతాయి.

## కృష్ణమూర్తి అభిభాషణ సారాంశమేమిటి?

"కృష్ణమూర్తి భారతీయుడు కాదు, అంటే ఈ జాతికి చెందినవాడు కాదు లేక బ్రాహ్మణ కమ్యూనిటీకి చెందినవాడు కాదు - అందులో పుట్టివున్నా". ఇవి స్వయంగా కృష్ణమూర్తి మాటలు. అలానే జీవించారు. "జీవితంలో అన్ని స్థాయిలలోనూ అసమానతవుంది. ఇది వాస్తవం....... కాని నేను సమాన అవకాశాలకు వ్యతిరేకినికాను" అని అన్నారు. ఇంకా "స్వేచ్ఛ, సౌఖ్యం నేను పొందాను. దీన్ని ఇతరులు పొందడానికి సాయపడడం జీవిత ధ్యేయం. నా ప్రబోధం మార్మికమూ కాదు, ఇంద్రియాతీతమూ కాదు. ఎందుకంటే అవి రెండూ మానవుడు సత్యానికి పెట్టిన హద్దులు. జీవితాన్ని ఉన్నదున్నట్లుగా అర్థంచేసికోరు. స్వర్గం, నిర్వాణం, దేవుడు, జీవితం, సత్యం మీద ఒక అభిప్రాయం పెట్టుకుంటారు. అభిప్రాయ సాధనకూ అవగాహనకూ మనస్సుకు వొత్తిడి తెస్తారు. దాంతో అన్ని నిరోధాలూ, బాధలూ, ఆధారణిలో ప్రయత్నాలూ విరమణ అయ్యే స్థితికి రావాలని ఆశిస్తారు....... నేను దేవుడుగా నటించను. జీవిత లక్ష్యం సంపూర్ణం, మానవతో

త్తమం; చివరాంతపు సత్యమొకటుంది. మానవమాత్రుడుగా నేను అది సాధించాను......."

సరిగా వర్తించాలంటే, సరైన భావనవుండాలి. సరైన భావనకు స్వయం జ్ఞానముండాలి. స్వయం జ్ఞానం సంబంధంలోనే వుంది గాని, ఒంటరితనంలో లేదు. కాబట్టి మన సమస్యలోనే సరైన చర్య, అవగాహన, సౌఖ్యం వున్నాయి. "ప్రవచనాన్ననుసరించి బ్రతకడం మాత్రమే మన బాధ్యత" అని ఫౌండేషన్ సభ్యులకు 1984 లోనే చెప్పారు. "నీవు ఎవరిని అనుసరింతువో, ఎవరిని పూజింతువో అతడు నీ వినాశకారి" అని గుర్తించుకోవాలని హెచ్చరించారు.

జీవితం అంటే దైనందిన జీవితపు సామాన్య సంఘటనల అల్లిక. వాటిని ఉపయోగించుకోకపోతే చిన్న చిన్న విషయాల వుద్దేశం తప్పిపోతుంది, జీవితంలో వుండే గొప్ప విషయాలు కూడ తప్పి పోతాయి. అవసరమైంది ఏమంటే పరిశుద్ధ మనస్సు; ప్రేమించే హృదయం. అందుకే జీవితపు ఎడారిలో కృష్ణమూర్తి ఒక జలా శయం అన్నారు, రోమ్ లాండ.

జీవించడం సరిగ్గా తెలిస్తే చావును గూర్చిన చింతలేదు. చావును గూర్చి చర్చించేవాడు జీవించడం లేదని అర్థం. పైగా మరణాంతర జీవితంపై ఆశలు పెంచుకుంటాడు. మరణమూ జీవితమూ కలిసే వుండడం కృష్ణమూర్తి జీవిత సత్యం. గతించిన మానసిక విషయాల పట్లా, అనుభవాల పట్లా, భవిష్యత్తుకు పాకే వూహల పట్లా ఎప్పటి కప్పుడు విస్మృతి చెందడమే మరణం. అలా మరణానంతరం వుండేది నూత్న జీవితం. ఈ విధంగా జీవిస్తుండగానే మరణం చవిచూస్తుం టాము. జీవితమూ, మరణమూ కలిసే సాగుతుంటాయి. అపుడు చిట్టచివరి భౌతిక మరణం (clinical death) గురించి, సంపాదన మొత్తం పోతుందనే మానసికమైన భయం వుండదు. నిర్భయస్థునికి యావత్తు జీవితం చైతన్యవంతంగా సాగిపోతుంది - సెలయేరులా గలగలా, తళతళా, జరజరా.

జీవితం వాస్తవమైంది. జీవిత సత్యమే సత్యం. కాని ఈ సత్యశోధనకు విశ్వాసం, అభిప్రాయం, దైవభావం, స్వర్గాపేక్ష, పుణ్యపాపభయాలు అడ్డొస్తున్నాయి. వాటి వత్తిడికిలోనై మనిషి ఏమతాచార్యుడినో, బాబానో, గురువునో ఆశ్రయిస్తాడు. "ఇదంతా వృధాయేకాదు, దగా. అంతామోసం, వంచన, దోపిడీ. సత్యాన్వేషణకు ఇది మార్గం కాదు. ఎవరినీ ఎవరూ ఉద్ధరించలేరు. ఏ మతం, మఠం, పీఠం, విశ్వాసం - ఏదీ సత్యదర్శనం చేయించ లేదు. వీటిని నమ్ముకోవడం కాననివాడు, కానని వాడిని ఊత గొనడం వంటిది. ఎవరికి వారే సత్యాన్ని అన్వేషించాలి. ఎవరికి వారే సత్యాన్ని కనుగొనాలి. ఏ గురువూ ఎవరికీ మార్గదర్శి కాలేడు" అని కృష్ణమూర్తి తనువు చాలించినపుడు ఆంధ్రజ్యోతి సంపాదకీయం (19-2-1986) చెప్పింది అక్షర సత్యం.

జీవితం పరిపూర్ణమయ్యేది ప్రేమతోనే. ఋణాత్మకంగా చూసిన పుడు ప్రేమకానటువంటి వాటిని, అనగా - ఆశ, ద్వేషం మున్నగు - వాటిని పూర్తిగా కాదన్నపుడు ప్రేమవుంటుంది. ప్రేమంటే ఆలోచనా కాదు, ఆనందమూ కాదు, కోరికా కాదు, వ్యాపారమూ కాదు. ప్రేమ లేని జీవితం అసహ్యమైంది. ప్రేమలేని జీవితం నీళ్లులేని మడుగులాంటిది. ప్రేమ మాత్రమే సరియైన క్రియకు పురి కొల్పుతుంది. ప్రేమ పువ్వులా పుష్పించాలి.

ఇదీ కృష్ణమూర్తి జీవితతత్వం. మనకు అందించిన ప్రేమజ్యోతి.

(ప్రత్యేకవ్యాసం – తిరుపతి 11-5-1992)

* * *

# కృష్ణమూర్తి తత్వంలో
# మరికొన్ని ముఖ్యాంశాలు!

కృష్ణమూర్తి ఆధునిక దార్శనికుడు. మనో విజ్ఞానవేత్త. జీవిత తత్వప్రవక్త. నిత్య సత్య సంశోధకుడు. సంతతధ్యాన సంపన్నుడు. ప్రేమైక మూర్తి. కరుణా సముద్రుడు.

తొంభై ఏళ్లకు పైపడి సర్వేంద్రియ వికాసంతో, చెక్కుచెదరని సహజారోగ్యంతో జీవించారు. "నేను దైవాంశ సంభూతుడను కాను. నాకు ఆలయాలూ, ఆరాధనలూ వద్దు. నన్ను గురువుగా స్వీకరించ వద్దు...." అని విన్నవించారు.

జిడ్డు కృష్ణమూర్తి ప్రవచించిన జీవనదర్శనం లోని కొన్ని ముఖ్యాంశాల గూర్చి క్లుప్తంగా చెపుతాను.

జిడ్డు కృష్ణమూర్తి అనగానే అర్థంకాదనేవారూ, అలక్ష్యం చేసే వారూ, భయపడేవారూ చాలామంది వున్నారు. ఒకటి, వారు చెప్పేది సన్నిన్నులేని సరళమైన జీవిత విషయం. రెండు, తమ అనుభూతిని వ్యక్తం చేయాలని యత్నిస్తారు. మూడు, మన జీవితాలు బహుసంక్లిష్టంగా తయారై వున్నాయి. ఈ మూడు కారణాలవల్ల వారి అనుభవ వచనాలు అర్థం చేసికోవడం కష్టం అనిపిస్తోంది. శ్రోతలు నిష్పాక్షికంగా, దేనికీ కట్టుబడకుండా, ముందే స్థిర అభిప్రాయాలు ఏర్పరచుకొని వుండకుండా వుంటే చాలా అంశాలు తేటతెల్లం అవుతాయి. ఈ సందర్భంలో నేను కొన్ని ముఖ్యాంశాలు ఎన్నుకున్నాను. అర్థం చేసికోవడంలో కష్టమనుకున్న వాటిని ఏరుకున్నాను. పూర్వం చెప్పిందానికి భిన్నంగా చెప్పిన అంశాలే తీసికున్నాను. అవి ఏమిటంటే:

1) ఎరుక 2) ద్రష్ట 3) తెలివి.

ఒక్కొక్క విషయం సంక్షిప్తంగా నా మాటల్లోనూ, వారి మాటల్లోనూ వివరిస్తాను.

## CHOICELESS AWARENESS - ఎన్నికలేని ఎరుక:

వికల్పం గానీ, వికారం గానీ లేని చూపు, గ్రహింపు, జాగృతి. ఇది కావాలీ అది వద్దు, ఇది ఇష్టమూ అది అయిష్టం అని లేకుండా తటస్థించిన ప్రతిదానిపట్ల గమనికగా వుండడం. మానసిక విష యాల్లో ఇది వర్తిస్తుంది. ఏ అభిప్రాయమైనా మనసుకు రావచ్చు. ఒక దాని తరువాత మరొకటి, అనుకూలంగానూ రావచ్చు, వ్యతి రేకంగానూ రావచ్చు. దీన్ని గ్రహిద్దాం, దాన్ని నెట్టివేద్దాం అనే ధోరణి పట్టరాదు. పట్టిందా సంఘర్షణే. కాబట్టి వచ్చిన అభిప్రా యాన్ని వచ్చినట్లు వాచ్ చేయాలి, గమనించాలి. దాని పట్ల ఎరుక వహించాలి, శ్రద్ధ వుంచాలి, సావధానత చూపాలి. అదే ఎన్నిక లేని ఎరుక. అభిప్రాయం వస్తువుకాదు. అందుచే వాస్తవం కాదు. చాయిస్‌లెస్ అవేర్‌నెస్ వల్ల అక్కరలేని వన్నీ ఆకుల్లా రాలిపోతాయి. నిలబడేవి నిలబడతాయి. అభిప్రాయం సంతోషాన్నిచ్చేదైనా, కష్టం కల్గించేదైనా, దాన్ని సంపూర్ణంగా మనసులో నిల్పుకొని, పర్యవేక్షిం చక పోతే యధాతథంగా అర్ధం కాదు. అభిప్రాయమంటే భావన కావచ్చు, ఉద్దేశం కావచ్చు, నమ్మకం కావచ్చు.

కోరికాంక్షించీ పట్టుదలగా ఒక అభిప్రాయం వెంటపడితే ఆలో చనా ప్రక్రియ రకరకాలుగా రంగప్రవేశం చేసి గజిబిజి - గందరగోళం - ఘర్షణ - మనస్తాపం కల్గిస్తుంది. ఎందుకంటే ఆలోచన నిజా నికి పరిష్కార మార్గమూ కాదు, నిజమైన అవగాహనా ఇవ్వలేదు. పైగా అసౌకర్యమిచ్చే అభిప్రాయాల స్వభావం అసలే తెలియకుండా పోతుంది. పట్టుదలకు పోయినపుడు పోరాటమే మిగిలేది. పోరా టంతో మానసికశక్తి క్షీణిస్తుంది.

సంతోషం కల్గించినా, సంతాపం కల్గించినా వచ్చిపోయే అభి ప్రాయమూ, వాటి క్రియలూ, ప్రభావాలూ మానవ స్వభావంలో,

చేతనంలో భాగమే. కాబట్టి తన్నుతాను పూర్తిగా తెలిసికోడానికి అన్ని అభిప్రాయాలపట్ల, క్రియలపట్ల సమగ్రమైన ఎరుక, గమనిక నిరంతరం అవసరం.

అభిప్రాయాల పట్ల నిర్లక్ష్యం చూపినా, తప్పించుకో జూచినా అవి తొలగవు. ఎక్కడో దాగి, బయటపడుతూ, గందరగోళం సృష్టిస్తూ, వ్యక్తిత్వంపై ప్రభావం చూపుతాయి. కాని ముఖాముఖి అర్థంచేసికుంటే, వాటి తీరును వెంబడిస్తే వాటిని అతిక్రమించ వచ్చు. మరోగుణమేమిటంటే జాగృతి వహించడంలో మనసుపై ముద్రపడదు, విశ్లేషణపాలు కాదు, పోలిక రాదు. పేరు పెట్టడం తోనూ, మరో అభిప్రాయం స్థిర పరచుకోవడంతోనూ పని వుండదు. ఇది PURE OBSERVATION. ఇక్కడ శబ్దాలతో పనిలేదు. అందుచే వక్రత చెందదు.

జాగృతి యొక్క పర్యవసానం తన్ను తాను పూర్తిగా ఎరిగి వుండడం. స్వచ్ఛంద స్వయంజ్ఞానానికి తెలివితో కూడిన వెసులు బాటు. దీన్ని ఆత్మజ్ఞానం అనవచ్చు కాని బ్రహ్మ వాచకంగా కాదు. దీనికెంతో చురుకూ, సావధానతా కావాలి.

## ద్రష్ట - దృశ్యం

కృష్ణమూర్తిగారు చెప్పే మరో సంక్లిష్టమైన సత్యమేమంటే - చూచేవాడూ చూడబడేదీ, ఆలోచించేవాడూ ఆలోచనా విషయం, అనుభవించేవాడు అనుభవం ఒకటే నన్న వాస్తవం. అది వారి అనుభూతిలోవున్న ఔన్నత్యం.

కాలిఫోర్నియాలో, మొదట మూడురోజులపాటు, తీవ్రంగా పరి వర్తన చెందినపుడు తన అనుభూతిని గూర్చి ఇలా చెప్పారు. పనీ పనివాడూ పనిముట్టూ, చెట్టూ చెట్టుకొట్టు వాడూ గొడ్డలీ, అంతా తానైనట్లు అవగతమయింది. "....పెప్పర్ వృక్షం క్రింద కూర్చున్నపుడు నాపై నక్షత్రం ప్రకాశించినట్లు గమనించాను. ....లోపలా, బయటా అపరిమితమైన ప్రశాంతిని పొందాను."

ఆలోచన తీసికుందాం. ఆలోచించేవాడు ఒకడున్నాడు, వాడు స్థిరంగా వుంటాడు, వాడికి అనేక ఆలోచనలు రావడం పోవడం జరుగుతుంటుంది, అందులో మేలైనవి తీసుకుంటుంటాడు అనే భావం ప్రచారంలో వుంది. దానివల్ల వచ్చే ఇబ్బంది ఏమిటయ్యా అంటే - 'నేను' శాశ్వతుణ్ణీ, పవిత్రుణ్ణీ అనుకుంటాను. ఈ వచ్చి పోయే ఆలోచనలతో నాకు పనిలేదు, అవి నాకు అంటవు అని అన్నిరకాల వైరుధ్యపుటాలోచనలూ చేస్తూ అసలు బాధ్యతల నుండి తప్పించుకుపోతూ వుంటాను. అంతమాత్రాన బాధ్యతలు వూరు కుంటాయా? వాటిని చూడకపోయినా, తీర్చకపోయినా, సరిగా స్పందించక పోయినా వర్తమాన జీవితం ఎగుడు దిగుడై చీకాకు కల్గిస్తుంది. అదే సంఘర్షణ. దాని ఫలితం తెలిసిందే. సరే, నీకు కోపం వచ్చింది. కోపం వేరూ, నీవూ వేరా? నీ మీద కోపం యొక్క ప్రభావం ఏమీ లేదా? నీవు వేరుగావుండి ఆలోచననూ, కోపాన్నీ స్వాధీనం చేసుకోవడమో, లేకుండా చేయడమో నీ చేతిలోపని అనుకుంటున్నావా? ఆ పనికి సాధన అని పేరా? చాలా పొరపాటు. ఆలోచనే నీవు, కోపమే నీవు. ఎందుకంటే ఆలోచన లేకపోతే అసలు నీవున్నావా? దాంతోపాటు నువ్వుకూడ ఎగిరిపోతావు. ఆలోచన పోయి నీవు వుండేటట్లయితే నీవు అహంకా రివై, ఉబ్బిపోయి, నీకు నీవే అలివిగాకుండా పోతావు. నీవూ కోపం ఒకటేననుకో, అపుడు నీవు కోపతాపానికి, మనస్తాపానికి అవకాశం లేకుండా జాగ్రతపడతావు. కోపమున్నపుడు నీవు కోపిష్టివి. నీవు బ్రహ్మవుకాదు. శాంతిమంతుడవు అంతకంటే కాదు.

చెట్టును చూస్తున్నావనుకో, చెట్టూ నేనూ ఒకటేనా, నేను చెట్టునా? అని ఒక పెద్దవాదం లేవనెత్తుతావు. భౌతికంగా నీవు చెట్టువు కాదు. అనుభూతిపరంగా చెట్టూనీవు ఏకమౌతారు, తాదాత్మ్యం చెందుతారు. రెండనే భావనలేని సంపూర్ణమైన అను భూతి చెందుతావు. అపుడు చెట్టును, నీ పూర్వస్మృతితో పోల్చ డంగానీ, విశ్లేషణ చేయడంగానీ, పేరు పెట్టడం గానీ, ఇంతేనా అని

తేలికపరచడం గానీ, నాకిది ముందునుంచీ తెలిసిందే అని నిర్లక్ష్యం చేయడం గానీ లేక ఉబ్బితబ్బిబ్బై లోబడిపోవడం గానీ, దీన్ని సొంతం చేసుకోవాలని తాపత్రయ పడడంగానీ వుండవు. ఇదెంత సరళంగా, సానందంగా వుందో చూడండి. ఇందులో బంధానికి గానీ సంఘర్ష ణకు గానీ తావుందా?

చూడడంలో; కనుగుడ్లు కదపకుండా చూడొచ్చు. అపుడు మెదడు అంటే ఆలోచన జోక్యం చేసుకోదు. అపుడు పరిశీ లకుడూ, పరిశీలితమూ ఒకటే. ఇద్దరి మధ్యా విభాగం లేదు. విశ్లేషకుడు లేడు. గతమే, గతజ్ఞానమే విశ్లేషకుడు. వాడు వర్త మానంలో అడ్డురాకుండడమే కావలసింది. భార్య వంక సరిగ్గా చూడకుండా చేసేది ఆ విశ్లేషకుడే, ఆ పాత ఇమేజే. ఇందులో వున్న కిటుకేమిటంటే "నేను" చూడడం వేరు, కేవలం చూడడం వేరు. రెండోది ఎరుకలో సాధ్యం. "నేను" అనేది హింసతో కూడింది అని అంటారు కృష్ణమూర్తిగారు.

## తెలివి INTELLIGENCE:

తెలివిని ప్రజ్ఞ అనికూడ చెప్తున్నాను. ఇది INTELLECT మాత్రం కాదు, బుద్ధికి సంబంధించింది కాదు. అర్థం చేసుకోవడం కొంచెం కష్టమే. ఈసారి బాగా కష్టమైన అంశాలు ఎన్నుకున్నాను. ఎంతవరకు సరళం చేయగలమో చూద్దాం.

బుద్ధితో జరిగేపని Reasoning హేతువివరణ. నిశ్చయం చేయడం, జ్ఞాపకం పెట్టుకోవడం, ఆలోచన చేయడం, జ్ఞానార్జన చేయడం దాని పని. సైన్సు అభివృద్ధికి బుద్ధిబలమే కారణం. దాని వద్ద యుక్తి ప్రయుక్తులున్నాయి.

ఈ తెలివి ఎప్పటికప్పుడు జనించేది. నెమ్మదైన మనసునుండి మాత్రమే పుడుతుంది. అది స్ఫురించేది మాత్రమే. సాధించేది కాదు. నమ్మకమూ, ఊహా, ప్రలోభమూ, విభజనా లేని స్థితినుండి

ఉత్పన్న మౌతుంది. అది స్వచ్ఛమైన ఖాళీమనసునుండి కలుగు తుంది. తెలివి స్వానుభవపూర్వక మైంది; స్వేచ్ఛకూ, సమతకూ సంబంధించింది. మానసిక నిశ్చలతే తెలివి. అది ఆలోచన కాదు. కాని ఆలోచనను - జ్ఞానాన్ని - ఉపయోగించుకొంటుంది. ఇది వాదనవల్ల వచ్చేది కాదు. మెదడు తన లోటుపాట్లనూ, సామర్థ్య మునూ గుర్తించి నపుడు ఆ తెలివి కలుగుతుంది. పాత మెదడు పరిమితి తెలియగానే కొత్తదనం, పూర్తిగా కొత్తదనం వస్తుంది. అదే తెలివి. పాత మెదడులో వచ్చేది ఆలోచన. తెలివి దీనికి పూర్తిగా వేరైంది.

Inter, Legere అనే పదాలతో Intelligence శబ్దం ఉత్పత్తి అయింది. To read between అని అర్థం, అంతరార్థం, అసలుభావం; యదార్థం గ్రహించేది తెలివి. అది సహజమైంది - INNATE. కాని దాని సహజోత్పన్నతకు మనం తావు ఇవ్వకుండా జ్ఞానార్జనా, ధనా ర్జనా, ఆధ్యాత్మిక సాధనా, జాతీయభావన, వర్గ విభజన మున్నగునవి చిన్న వయసునుండీ మొండిగా నూరిపోస్తున్నాము. ఒకప్రక్క సమాజం అవినీతి మయంగా వున్నదంటూనే, ఆ అవినీతికరమైన సమాజంతో సర్దుకు పోయేటట్లు మనసును చంపుకోమంటున్నాము. ఇలా మనసు నశించి, హృదయం కృశించిపోతే తెలివి ఎక్కడ నుండి వస్తుంది?

ఆ తెలివి వున్నపుడు జరిగే పనిఏమిటంటే పరిశీలన, పరి శోధన, అవలోకన, ఆలోకన, అధ్యయన, అంతర్దృష్టి, ప్రత్యక్ష దర్శన. తెలివివల్ల ఎప్పటికప్పుడు ప్రతిదానిలోనూ యదార్థం ఎదు రౌతుంది. వాస్తవికతతో ఉట్టిపడేది జీవితం. ఊహతో కూడింది కాదు.

ఇంతకీ తెలివి తనపోకడలు తెలిసికోడానికి బాగా ఉపయోగ పడుతుంది. ఇతరుల పోకడలు కూడ తెలుస్తాయి. ఉన్నవి ఉన్నట్లుగా తనలోకి తాను చూసుకొన్నపుడు "అహం" అంతమై, "నాకు తెలియదు" అనే స్థితి వస్తుంది. ఈ వాస్తవమైన తెలివి

పరళమైన ప్రవర్తన కల్గిస్తుంది. ఎక్కడ భయంలేదో, ఎక్కడ కాంక్షలేదో, ఎక్కడ స్వేచ్ఛవుందో, ఎక్కడ తననుతాను, తన వాస్తవికస్థితిని తాను తెలిసికుంటాడో అక్కడ తెలివివుంది. అది పరళతనే గాక, స్పష్టతనూ, సూటితనాన్నీ ఇస్తుంది.

తెలివి ప్రవర్తనలో ఎలా మార్పు తెస్తుందో చూద్దాం. నిజాయితీతో కూడిన లోజూపువల్ల నెమ్మదితనం కలుగుతుంది. తద్వారా తెలివి పుడుతుందని తెలుసుకున్నాము. ఇక నిజాయితీ, సరళత, స్పష్టత, సూటితనం వున్నవాని ప్రవర్తన వాటి కనుగుణ్యంగానే వుంటుంది కదా! ఎలాగంటే లోజూపు నిలిచినపుడు - అది తనను తాను చూస్తుంది ప్రవర్తనను ప్రభావితం చేస్తూ, దుఃఖాన్ని చూస్తుంది - కరుణ కల్గుతుంది లేక కరుణను స్పృశిస్తుంది; కరుణ పర్యవసానం ప్రేమ. ప్రేమంటే ఏకత్వం, అఖండత్వం. ఏకత్వం మానవత్వానికి ప్రతీక. కాబట్టి తెలివీ, ప్రేమా కలిసివుంటాయి. అదే జీవితం.

ఈ విధంగా అనేక జీవిత విషయాలపై నూతనమైనట్టీ, వాస్తవికమైనట్టీ అవగాహన కల్గించారు శ్రీ జిడ్డు కృష్ణమూర్తిగారు.

(కడపలో రేడియో ప్రసంగంలో కొంతభాగం
తిరుపతి – 11-6-1992)

* * *

# విషయమూలం

## ఆధార గ్రంధాలు

### By J. KRISHNAMURTI

1. The First and Last Freedom
2. The Awakening of Intelligence
3. Commentaries on Living I Series
4. Commentaries on Living II Series
5. Commentaries on Living III Series
6. Life Ahead
7. Tradition and Revolution
8. Beyond violence
9. The only Revolution
10. The Wholeness of Life
11. This Matter of Culture
12. Education and the Significance of Life
13. Questions and Answers session: 30-12-1982
14. Interview with Pritish Nandy: Sunday special - Sept. 12-18, 1982

### By MARY LUTYENS

15. Krishnamurti: The years of Awakening
16. Krishnamurti: The years of Fulfilment

### జె. శ్రీరఘుపతి రావు

17. జిడ్డు కృష్ణమూర్తి జీవన దర్శనము
18. జిడ్డు కృష్ణమూర్తి అవగాహన

# జె. శ్రీ రఘుపతిరావు గారి
# ఇతర రచనలు

1. జిడ్డు కృష్ణమూర్తి జీవిత సంగ్రహము
2. కృష్ణ సూక్తము
3. ప్రశ్నోత్తర బోధిసత్వము

రానున్నవి

1. జిడ్డు కృష్ణమూర్తి జీవిత భాషణం
2. తథాగతుడు
3. డా. బి. ఆర్. అంబేద్కర్ [ప్రభావం - ప్రబోధం]
4. ఇది "వేదాంతం" కాదు

